# భాషణములు 101

అంబాలానుండి వచ్చిన ఒకరు ఇలా ప్రశ్నించారు. ద్రౌవది చీర అనంతమవటానికి తార్కికమైన వివరణ ఏమిటి?

మ: ఆధ్యాత్మిక విషయాలు హేతువాదంలో ఇమడలేవు. ఆధ్యాత్మికము వీటన్నిటికీ అతీతము. ద్రౌపది శరణాగతి తర్వాత ఈ అద్భుతం జరిగింది. దాని రహస్యం శరణాగతిలో వుంది.

భ: హృదయాన్ని చేరేదెలా?

మ: హృదయాన్ని చేరాలని నీవు అనుకోడానికి ఇప్పుడు ఎక్కడ వున్నావు? ఆత్మకు వేరుగా, దూరంగా వున్నావా?

భ: నేను నా దేహంలో వున్నాను.

మ: ఒక ప్రత్యేక ప్రదేశంలో ఉన్నావా? లేక దేహమంతా ఉన్నావా?

భ: దేహమంతట. నేను దేహమంతటా వ్యాపించి ఉన్నాను.

మ: ఆ వ్యాపించడం ఎక్కడనుండి?

భ: నాకు తెలియదు.

మ: నిజమే. నీవు ఎప్పుడూ హృదయంలోనే వున్నావు. నీవు దానికెప్పుడూ దూరంగా లేవు. ఇప్పుడు దాన్ని చేరుకునేందుకు, నిద్రలోనూ, మెలుకువలోనూ నీవెక్కడున్నావో ఆలోచించు. ఆ అవస్థలు (జాగ్రత్, స్వప్న, సుషుప్తి) కూడా నీవు కాదు. అవి అహంకారానికి సంబంధించినవి. శుద్ధ చైతన్యం ఎల్లప్పుడూ, భేద రహితమై ఒకే విధంగా వుంది.

భ: అర్థమేమో అవుతోంది. కాని ఆ విషయం అనుభవగ్రాహ్యం అవడం లేదు. (ఫీల్ అవడంలేదు)

మ: ఆ అజ్ఞానం ఎవరిది? అది కనుక్కో

భ: ఇది అంతా ఎంతో కష్టంగా వుంది.

మ: కష్టమనే భావనే తప్పు. నీవు కోరేదాన్ని పొందడానికి అది సహాయపడదు. మళ్ళీ నేను అడుగుతున్నాను. “అది కష్టమని ఎవరు అనుకుంటున్నారు?"

భ: తిరిగి తిరిగి వచ్చి “నేను” వద్దకే వస్తున్నట్లు నాకు అనిపిస్తోంది.

మ: ఎందుకంటే నీవు ఎప్పుడూ అదే. ఎప్పుడూ దానినుండి దూరంగా లేవు. ఆత్మగా “నేనుగా” ఉండడంకంటే సులభమైనది ఏదీ లేదు. దానికి ఏ ప్రయత్నం అక్కరలేదు. ఏ సహాయం అక్కరలేదు. వ్యక్తి మిధ్యాతాదాత్మ్యమును వదలిపేసి శాశ్వతము, సహజము అయిన తన నిజస్థితిలో నిలిచి ఉండాలి.

## భాషణములు 102

మర్నాడు ఆ వ్యక్తియే తిరిగి వచ్చి ఇలా ప్రార్థించాడు. “గురూపదేశం అవసరం అంటారు. కేవలం పుస్తకాలు చదివినంత మాత్రాన ప్రయోజనం లేదు. ఎన్నో గ్రంథాలు చదివాను. కాని ఆ చదవడం వలన నాకు దైనందిన జీవితంలో సహాయం ఏమీ కనబడలేదు. దాని వలన దయచేసి నేను ఏమి చేయాలి, ఏలా చేయాలి, ఎప్పుడు, ఎక్కడ ఎలా ఉండాలి మొదలైనవి తెలియచేయండి.

మహర్షి మౌనంగా ఉన్నారు. తన మౌనంతో “ఇప్పుడు ఇక్కడ ప్రశాంతంగా స్థిమితంగా ఉండు. చేయవలసింది అంతే" అని చెప్పినట్లు అనిపించింది. కాని ఆయన ఆ విధంగా అర్థం చేసుకోలేకపోయాడు. ఆయనకు స్పష్టము నిర్దిష్టమైనది ఏదో కావాలి.

## భాషణములు 103

మర్నాడు శ్రీభగవాన్ ఇలా అన్నారు: “వీరికి జప, ధ్యాన, యోగాదులేవో కావాలి. వారు ఇంతవరకు ఏమి చేస్తున్నారో చెప్పకపోతే, వారికి ఇంతకంటే చెప్పగల్గినది ఏముంటుంది? ఇంతకూ జపాలు, ఫలశ్రుతులూ, ఇవన్నీ ఎందుకు? ఏమి చేస్తే జపమవుతుంది? దాని ఫలితం ఎవరికి చెందుతుంది? ఆత్మవిచారం చెయ్యరాదా? అంతలో సరిపోదు. జపధ్యానాదులను ఉపదేశించినా వారు దాన్ని కొద్దికాలమే చేస్తారు. వారి దృష్టి అంతా ఫలితాలపైనే - ఏవో దృశ్యాలు, స్వప్నాలూ, సిద్ధులూలాంటి వానికై. అవి లభించకపోతే, తామేమాత్రం ముందుకు సాగడం లేదనో, తపస్సు ఫలకారి కాలేదనో నిరుత్సాహపడతారు. దృశ్యాదులు ప్రగతిని సూచించవు. కేవలం తపస్సు చెయ్యడమే దాని ప్రగతికి సూచన. శ్రద్ధ, నిశ్చలత్వము ముఖ్యము. అంతేకాక, వారు తమ మంత్రమునకుగానీ, తమ దైవమునకుగానీ తమ్ముతాము అర్పించుకొని (ఆత్మార్పణము) అనుగ్రహానికై వేచి ఉండాలి. కానీవారు అలా చెయ్యరు. జపం ఒక్కసారి ఉచ్చరించినా, ఆ వ్యక్తికి తెలిసినా తెలియకపోయినా దానికి తగిన సత్ఫలితం దానికి ఉంటుంది.

## భాషణములు 104

అఖిల భారత రైల్వే బోర్డు ఒక అధికారి శ్రీ కిశోరీలాల్ ఢిల్లీ నుండి వచ్చారు. నిరాడంబరుడు, సౌమ్యుడు, నడతలో గౌరవం కనిస్తుంది. ఆయనకు కడుపులో వ్రణం. భోజన వసతులు ఊరిలో ఏర్పాటు చేసుకున్నారు.

ఐదేండ్లుగా భక్తిసాహిత్యం చదువుతున్న ఒక కృష్ణభక్తుడు. అన్నింటిలో కృష్ణునే చూడగలడు. కృష్ణునెన్నిమారులో చూచి ఆనంద తన్మయుడయ్యేవాడు. ఆయన ఉద్యోగ వ్యవహారాలు, ఆయన యత్నం లేనట్లే జరిగిపోయేవి. ఆయనకన్నీ కృష్ణుడే చేసిపెడుతున్నట్లనిపించేది.

కొంతకాలానికి ఆయనకొక మహాత్ములు తారసిల్లారు. వేదాంతం నేర్చి నిరాకారోపాసన చేయుమని ఆదేశించారు. నాటినుంచి తత్త్వవేదాంత గ్రంథాలు, ఉపనిషత్తులు, అష్టావక్ర, అవధూత, భగవద్గీతాదులు సుమారు ఏడువందల గ్రంథాలు చదివారు. శ్రీభగవాన్ రచనల ఇంగ్లీషు అనువాదాలూ పఠించారు. వారికవి ఎంతో నచ్చాయి.

ఒక మారాయన జ్వరపడి మృత్యుముఖంలోనున్నారు. ఆయననొక చింత వేధించింది. జీవితంలో శ్రీభగవాన న్ను దర్శించుకోలేదే యని. ఒళ్ళు నయమైన తర్వాత కొంత కాలానికి ఇక్కడకి రాగల్గారు. శ్రీభగవాన్ స్పర్శ, అనుగ్రహమూ మాత్రమే వారు కోరినవి.

వారితో శ్రీభగవాన్ ఇలా అన్నారు:

“ఆత్మైవాహం గుడాకేశ” -నే నాత్మను; ఆత్మయే గురువు; ఆత్మయే అనుగ్రహమన్నా. ఆత్మ లేక ఎవరూ ఉండలేరు. అది ఎప్పుడూ స్పర్శలోనే ఉంది. బాహ్యస్పర్శ అక్కరలేదు.

భ: గ్రహించాను. నేను కోరే స్పర్శ బాహ్యం కాదు.

మ: ఆత్మకన్న సన్నిహితం వేరొకటున్నదా?

భ. 'మూడు నెలల క్రితం కృష్ణులు నాకు కనిపించి తెలిపారు.

'నిరాకారో పాసనను' నన్నెందు కడుగుతావు? అది ఇంతమాత్రమే. 'సర్వభూతేషు చ ఆత్మానం, సర్వభూతానిచ ఆత్మని' (ఆత్మ అన్నింటిలో, అన్నీ ఆత్మలో).

మ: దానిలో సత్యమంతా ఉంది. అదిగూడ పరోక్షమే. నిజానికి ఆత్మ తప్ప వేరొకటి లేదు. జగత్తు మనస్సు కల్పించినది. మనస్సు ఆత్మనుండి పుడుతోంది. కాబట్టి ఆత్మయే ఆ ఏకం సత్.

భ: అయినా సరే. అనుభవం చాలా కష్టం.

మ: అనుభవం సాధించుటేమి? అది నిత్య శుద్ధ, బుద్ధ, ముక్తస్థితి. అది సహజము. సాధించటానికి అది క్రొత్తదా? కర్తవ్యము సాధించటంగాదు, త్యజించడం, అజ్ఞానాన్ని వదులుకోవాలి అంతే.

అజ్ఞాన మూలం వెదకాలి. ఎవరికి అజ్ఞానం? వానికి అజ్ఞానమేది? కర్త - విషయము, ఇట్టి ద్వంద్వ భావన మనస్సు లక్షణము. ఆ మనస్సు ఆత్మనుండి. వచ్చినది.

భ: అవును. అజ్ఞానం స్వతహాగా ఉండజాలదు.

చివరకాయన భగవాన్ ను శరణు వేడారు. "రోగనిదాన మెరిగి చికిత్స చేసే వైద్యునివలె శ్రీభగవాన్ నాపట్ల వర్తిల్లుదురు గాక" ఇక పుస్తకములు చదివి నేర్చుకొనే ఆసక్తి పూర్తిగా వదులుకొన్నా నన్నారు.

# భాషణములు 105

మహర్షి: "ఏన అశ్రుతమ్ శ్రుతమ్ భవతి' (ఛాందోగ్యోపనిషత్) - దేని తెలియుటచే, తెలియనివన్నియును తెలియనగునో.

భగవాన్ పరిచారకుడు మాధవస్వామి: ఛాందోగ్యపనిషత్తులో మహావాక్యము "తత్త్వమసి"ని బోధించుటకు తొమ్మిది పద్ధతులు ఉన్నాయా?

మ: లేవు, లేవు. పద్ధతి ఒక్కటే. ఉద్దాలకులు 'సత్ ఏవ సౌమ్య' సత్ మాత్రమే ఉంది - అని బోధింప నారంభించి, శ్వేతకేతువు ఉపవాసముతో వివరించారు.

1. సత్, వ్యక్తిలో కలదని ఆ ఉపవాసం సువ్యక్తం చేస్తున్నది.

2. పలు పూవులనుండి కూర్చిన తేనెవలె, ఈ సత్ అందరిలోనూ సమానమే.

3. జీవులలోని స్థితులలో అంతరం లేదు. ఈ విషయం గాఢనిద్రలో స్పష్టంగా తెలుస్తుంది. ప్రశ్న ఏమంటే అలా అయితే నిద్రలో అది అందరికి తెలియాలి కదా?

4. తెలియదు, వ్యక్తిత్వం స్పష్టమైనది గనుక. మిగిలియున్నది 'సత్' మాత్రమే. సముద్రములో నదులు లీనమయినట్లు, వ్యక్తిత్వము, నష్టమైనప్పుడు సత్ ఉందా?

5. చెట్లు కొమ్మలు కత్తిరిస్తే, అవి తిరిగి ఎదుగునట్లు, ఎదుగుట, చెట్టు బ్రదికియున్నదని గురుతు. ఆవిధంగా తప్పక అది అక్కడ ఉంది. నిద్రాణంగానైన "సత్" అక్కడ ఉండునా?

6. ఉండును. ఉప్పు, నీరు, ఉదాహరణ తీసుకుందాం. నీటిలోని ఉప్పు అతి సూక్ష్మం. కంటి కగపడదు గాని యితర ఇంద్రియములకది తెలుస్తుంది. ఈ తెలియడం ఎలా? ఆ ఇతర ఉపాయాలేవి?

7. విచారణ వల్ల. గాంధారారణ్యములోన విడిచిన మనిషి తిరిగి ఇల్లు చేరుకున్నట్లు.

8. పరిణామ ఆవరణల్లోనూ, అవతరణ విరమణల్లోనూ (ఆవిర్భావము - లయములోనూ) ఉండునది సత్ ఒక్కటే 'తేజ పరస్య దేవతాయామ్' (అన్ని జ్యోతులూ పరంజ్యోతిలో కలియును).

9.అగ్ని పరీక్ష నిజాయితీ లేనివాడ్ని శిక్షిస్తుంది. నిజాయితీ స్వతఃసిద్ధంగా తెలుస్తుంది.

నిజాయితీ కలవాడు లేదా ఆత్మజ్ఞాని మిథ్యారూపాలుచేత (అంటే ప్రపంచము, జనన మరణాదులచేత) బాధింపబడకుండా సుఖంగా ఉంటాడు. కాని కుటిలుడు లేక అజ్ఞాని దుఃఖితుడౌతాడు.

గాఢనిద్రను వర్ణించినట్లుగా, అన్నీ సత్యవస్తువునుండే వచ్చాయి అని ఉద్దాలకుడు బోధించేడు. దేహం అన్నాన్ని స్వీకరిస్తుంది. అన్నానికి నీరుకావలె, అన్నం జీర్ణం కావటానికి. ఆ నీటికి ఉష్ణత అవసరం. (తేజోమూల మన్విచ్ఛ) అది 'సత్ పరస్యామ్ దేవతాయామ్' (సత్తులో కలిసినది) మనము సత్ సంపన్నులమైతే (సత్తుతో కూడియుంటే) మనకదేల తెలియరాదు?

మ: వేర్వేరు పూలనుండి కూర్చిన తేనె, తేనెపట్టులో అధికభాగం పేరుతుంది దానిలోని ఏ తేనె చుక్కైనా తానెక్కడినుండియో సూచించదు. సత్ సంపన్నులూ అట్లే. గాఢనిద్రలో, మరణంలో వారి వారి వ్యక్తిత్వాలు గుర్తించరు. మేల్కొన్న పిదప వారి వారి తొలి వ్యక్తిత్వాన్ని తిరిగీ పొందుతారు.

భ: తేనెలో మధుబిందువులకు విశిష్ట, చిహ్నాలు లేవు. నిజమే, కాని వేర్వేరు అవయవాలూ లేవు; అవి తిరిగీ తమ మూలాన్నీ చేరవు. వ్యక్తి, గాఢనిద్రనుండి ఆ వ్యక్తి మేలుకొంటాడు. దీనికేమంటారు?

మ: నదులు, సముద్రమును చేరి తమ వ్యక్తిత్వాన్ని కోల్పోతాయి. కాని వాని నీరు ఆవిరియై వర్షమై గిరులపై కురిసి, ఏరులై సముద్రమునే చేరుతుంది. అట్లే వ్యక్తులు నిద్రలో తమ వ్యక్తిత్వమును కోల్పోతారు. కాని తమకు తెలియకున్నా, వారి వారి పూర్వవాసనల కనురూపంగా వ్యక్తులుగనే మరలి వస్తారు. ఆ విధంగా మృతిలో గూడ సత్ నష్టంగాదు.

భ: అదెట్లు సాధ్యము?

మ: చెట్టును చూడు. కొమ్మలను కొట్టివేసినా తిరిగి ఎదుగుతుంది. కూకటివేరు చెడనంత కాలము అది పెరుగుతూనే ఉంటుంది. ఆవిధంగానే సంస్కారాలు వ్యక్తి చనిపోయేటప్పుడు, హృదయంలో లయమౌతాయి. అవి నష్టముగావు. సరియైన కాలానికి అవి హృదయమునుండి తిరిగీ మొలకెత్తుతాయి. జీవుని పునర్జన్మ రీతి ఇది.

భ: హృదయంలో దాగి వున్న సూక్ష్మ సంస్కారములనుండి యింతటి విశాల విశ్వం ఎలా వస్తుంది?

మ: అల్పాల్ప బీజమునుండి అత్యున్నతమైన మర్రిచెట్టు ఎదిగిరాదా? అట్లే వివిధ నామరూపలముతోడి యీ విస్తృత విశ్వం హృదయంనుండి వెలువడుతుంది.

భ: సత్ మూలమైతే, అది ఎందుకు తెలియదు?

మ: గడ్డగా ఉన్న ఉప్పు కనిపిస్తుంది, ఏదైనా ద్రావకంలోనైతే కంటికి తెలియదు. రుచిచేతనే తెలుస్తుంది. అట్లే, సత్తు బుద్ధిచేత గ్రహింపవీలుగాదు. వేరేవిధంగా అంటే (అజ్ఞానమనే కళ్ళకుగంతలుగల) అజ్ఞాని అలా కళ్ళకు గంతలులేని (అంటే అజ్ఞానులు కాని) వారిని విచారిస్తూ తన మూలాన్ని అన్వేషించి దానిని చేరుకుంటాడు.

ఆమీద గురూపదేశం - “వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణాత్తేజసి, తేజః పరస్యామ్ దేవతాయామ్ ఇతి"

భ: జ్ఞాని, అజ్ఞాని ఇద్దరూ ఒకలాగే మరణిస్తారు కదా! అయితే అజ్ఞానికి పునర్జన్మ, జ్ఞానికి అది లేక పోవడం ఎలా?

మ: తప్త అయఃపిండము (ఎర్రగా కాలిన యినుపగుండు) నిర్దోషిని (సత్యాభినంధుని) బాధింపక తస్కరునే బాధించు రీతిగానే జ్ఞాని (సద్రహ్మాసత్యాభిసంధుడు) సత్లో తెలిసియే ప్రవేశించి లయమౌతాడు. అజ్ఞాని తనకు తెలియక ప్రవేశిస్తాడు, తెలియకే బయటకు తోసి వేయబడతాడు.

# భాషణములు 106

స్వామి యోగానందులు నల్గురు వ్యక్తులతో ప్రొద్దున 8.45 గంటలకు వచ్చి చేరారు. దీర్ఘకాయుడు, సౌమ్యుడు, సంస్కారం కలవాడు. నల్లని పొడవైన జుట్టు భుజాల క్రిందికి జారుతున్నది. ఆశ్రమంలోనే వారు మధ్యాహ్న భోజనం చేసేరు.

ఆయన కార్యదర్శి శ్రీ సి.ఆర్. రైట్ అడిగారు కల్గుతుంది? 'దైవానుభూతి నాకెట్లు

మహర్షి: భగవంతుడు ఒక తెలియని వ్యక్తి. పైగా ఆతడు బయట ఉన్నాడు. కాని ఆత్మయంటేనో నీతోనే సదా ఉంటుంది, అది నీవే. అంత దగ్గరదాన్ని వదలి, దూరమున ఉండుదానికై వెదకడం ఎందుకు?

భ: మరి ఈ ఆత్మయంటే ఏమిటి?

మ: ఆత్మ అందరెరిగినదే, కాని స్పష్టంగా మాత్రం కాదు. నీవెప్పుడూ ఉన్నావు. ఆ ఉన్నదే ఆత్మ. 'అహమస్మి' అదీ దైవం పేరు. దైవ నిర్వచనాలన్నిటిలో ఒప్పినది, బైబిల్ (ఎక్సోడస్, అధ్యాయం 3)లోని 'నేనది నేను'- అయామ్ దట్ అయామ్.

బ్రహ్మైవాహం, అహం బ్రహ్మాస్మి, సోహం అన్న వచనాలూ ఉన్నాయి. కాని మిక్కిలి సూటియైనది 'జిహోవా' = నేనున్నాను. ఉన్నది బ్రహ్మమే - అదే 'ఆత్మ', అదే దైవం; తన్నెరుగుట, దైవాన్నెరుగుటే. నిజానికి, దైవం ఆత్మకు వేరుగాదు.

భ: మంచి, చెడులు ఎందుకున్నాయి?

మ: అవి సాపేక్షికాలు. అంటే ఒకటిని, ఆ రెండవదానితో పోల్చి తెలియవలసింది. మంచి - చెడ్డలు తెలిసికోడానికి ఒక కర్త ఉండాలి. ఆ కర్తయే అహంకారం. అహంకారం మూలం కనిపెట్టు. అది 'ఆత్మ'గా పరిణమిస్తుంది. అహంకారం యొక్క మూలం దైవం. దైవానికి ఈ నిర్వచనం, స్థూలంగా నీ కర్థమయ్యేట్టుగా ఉన్నదా?

భః ఉన్నది, ఆనందాన్ని పొందేదెలా?

మ: అది పొందవలసిందిగాదు, నిత్యానందం నీవే, ఏదో కొరతపడ్డదన్న చింతయే కోరికకు కారణం. ఈ అసంపూర్ణత, అసంతృప్తి ఎవరికి? విచారించు. గాఢనిద్రలో నీవు ఆనందంగా ఉన్నావు. ఇప్పుడట్లు లేవు. ఆ ఆనందానికీ, ఇప్పటి నిరానందానికీ నడుమ ఏ మడ్డువచ్చింది. అది అహంకారం. దాని ఆధారం వెదకితే, ఆనందం నీవేనని కనుగొంటావు.

సంపాదించటానికి అది క్రొత్తగాదు. ఆనందానికి నీవు దూరము, వేరు అనే అజ్ఞానాన్ని త్యజించు. ఈ అజ్ఞానమెవరికి? అహంకారానికి. దాని మూలమన్వేషించు. అప్పుడహంకారం అదృశ్యమై, ఆనందము మిగులుతుంది. 'అది శాశ్వతమైనది. నీవే ఆ ఆనందం. ఇక్కడ, ఇప్పుడు -- అదే అన్ని సందేహాలను పరిష్కరించడానికి సమర్థమైన కీలకం. సందేహాలు మనస్సులో ఉదయిస్తాయి. మనస్సు అహంకారం నుండి పుడుతుంది. ఆ ఆహంకారం ఆత్మనుండి పుడుతుంది. అహంకార మూలాన్ని వెతికితే ఆత్మ తెలుస్తుంది. అది మాత్రమే మిగులుతుంది. ప్రపంచమంతా కూడా విస్తరించిన ఆత్మయే. ప్రపంచము ఆత్మకు భిన్నంగా లేదు.

భ: అత్యుత్తమ జీవన విధానము ఎలాంటిది?

అది జ్ఞానికా, అజ్ఞానికా అన్న దాన్ని బట్టి ఉంటుంది. జ్ఞాని దేనినీ A) ఆత్మకు అన్యంగాకాని, భిన్నంగా కాని చూడడు. అన్నీ ఆత్మలోనే ఉన్నాయి. ఈ ప్రపంచం ఉంది, అందులో ఒక శరీరం అందులో నీవు ఉన్నావు అనుకోవడం మొదలైనవన్నీ తప్పే. సత్యాన్ని గుర్తిస్తే ఈ విశ్వం మరియు దానికి ఆవలన ఉన్నది కూడా ఆత్మలోనే చూడవచ్చు. ఇది చూసే వ్యక్తి దృష్టి కోణం మీద ఆధారపడుతుంది. చూపుకంటిది. కన్నుకి ఒక స్థానం ఉంటుంది. ఈస్థూల చర్మచక్షువులతో చూస్తే మిగిలినవాళ్ళు మరియు వస్తువులు స్థూలంగా కనిపిస్తాయి. సూక్ష్మ నేత్రంతో (అంటే మనస్సుతో) చూస్తే సూక్ష్మంగా కనిపిస్తాయి. అదే దృష్టి ఆత్మగా మారితే, చూపు ఆత్మగా అనంతంగా మారుతుంది. ఎందుకంటే ఆత్మ అనంతం. ఆత్మనుండి వేరేగా చూసే దానికి 'ఏదీలేదు. ఏదీలేదు.

# భాషణములు 107

తర్వాత యోగానందులు: 'జనులను ఆధ్యాత్మికంగా ఉద్ధరించేదెలా? వారికి ఇవ్వవలసిన శిక్షణ ఎట్టిది?'

మహర్షి: అది వారివారి మనస్థితులనుబట్టి, ఆధ్యాత్మికంగా వారివారి పరిణతినిబట్టి ఉండాలి. అందరికీ ఒకే విధమైన శిక్షణ సాధ్యం కాదు.

భ: ప్రపంచంలో ఇంత దుఃఖాన్ని దేముడు అనుమతించాడు. తన సర్వశక్తితో ఒక్క వ్రేటులో సర్వదుఃఖములూ నిర్మూలించి, సమష్టిగా ఆత్మసాక్షాత్కారం ప్రసాదించ కూడదా?

మ: భగవంతుడ్ని పొందడానికి దుఃఖం మార్గము.

భ: మరోవిధంగా దాన్ని నిర్దేశించ వచ్చుకదా!

మ: అదే మార్గం.

భ: యోగము, మతమూ మొదలైనవి దుఃఖనివారకాలా?

మ: అవి దుఃఖాన్ని దాటడానికి సహాయకాలు.

భ: అసలు దుఃఖం ఎందుకుండాలి?

మ. ఎవరా దుఃఖం అనుభవించేది? దుఃఖం అంటే ఏమిటి?

బదులు లేదు. చివరకు యోగానందులు లేచి తాము పూనిన కార్యము విజయవంతమగుటకు భగవాన్ అనుగ్రహం వేడారు. అంత త్వరగా తాను మరలిపోవలసినందుకు సంతాపం తెలిపారు. ఆయన ఋజువర్తనులుగా, భక్తిపరులుగా, కొంత భావపూరితులుగా కన్పించారు.

(భాషణములు 108, 105లో కలుపబడింది)

# భాషణములు 109

అంబాలానుంచి ఇద్దరు కొన్నివారాలుగా ఆశ్రమంలో ఉన్నారు. సెలవు తీసుకుని వెళ్ళబోయేముందు వారిలో ఒకరు ఇలా అడిగారు.

భ: ఆధ్యాత్మికంగా ఆలసత్వంలో ఉన్న నా మిత్రవర్గాన్ని, ఇతరులను ఎలా జాగరూకులను చేసేది?

మ: ఆధ్యాత్మికంగా నీ మాంద్యాన్ని నీవు పోగొట్టుకొన్నావా? నీ నిద్రాశీలాన్ని తొలగించే ఆ శక్తి ఇతరులతో గూడ ప్రకటం కాగలదు. నీ యిచ్ఛాబలం ఇతరులపై పనిచేస్తుంది కాని అది తక్కువతరం, ప్రశస్తం కాదు. మొదట నీ గురించి నువ్వు జాగ్రత్తపడు.

భ: నా ఆధ్యాత్మిక ఆలసత్వాన్ని తొలగించడం ఎలా?

మ: ఎవరిదా ఆలసభావమో విచారించు. లోన జూచుకో, నీ విచారణలన్నీ ఆత్మవిచారణలు చేయి. అప్పుడు నీలో జనించేశక్తి ఇతరులపై గూడ పనిచేస్తుంది.

# భాషణములు 110

ఒక ఆమెరికన్ వనిత, సమాధిలో శ్రీభగవాన్ అనుభవాలను తెలియగోరింది. తన అనుభవాలను ముందు తెల్పి, అవి సరియైనవో, కావో కనుగొనరాదా యంటే ఆమె బదులిట్లు - శ్రీభగవాన్ అనుభవాలు సరిగా నుండక తప్పదు. అందరికీ తెలియవలసినవి. తన అనుభవాలు ముఖ్యంకాదు. సమాధిలో భగవాన్ శరీరము వేడి ఎక్కిందా, కాక చల్లనైనదా? శ్రీభగవాన్ ఇక్కడికి వచ్చిన మొదటి మూడున్నరయేండ్లూ, ప్రార్థనలతోనే గడిపారా - ఇలాంటివి ఆమె తెలియగోరినవి.

మ: సమాధి మనస్సుకు వాక్కుకు అందదు. అందువల్ల దానిని వర్ణించలేము. గాఢనిద్రనెవరైనా వర్ణించగలరా? సమాధి స్థితిని తెలపటం మరీ కష్టం.

భ: గాఢనిద్రలో చేతన లేదని నాకు తెలుసు.

మ: చేతస్సు, అచేతస్సు కేవలం మనోవృత్తులు. సమాధి, మనస్సు కతీతము.

భ: అయినా గూడ, అది ఎట్లుండెనో మీరు చెప్పవచ్చు.

మ: నీవు సమాధిలో ఉన్నప్పుడు మాత్రమే అది నీకు అర్థమవుతుంది.

# భాషణములు 111

భ: ఒక తెలుగు ఆయన బ్రహ్మభావన గూర్చి అడిగారు.

మ: నేను బ్రహ్మముననీ, సర్వమూ బ్రహ్మమే యని ఆలోచన మానితే అదే జీవన్ముక్తి.

భ: ఆయన స్ఫూర్తితో కూడిన పనులగురించి అడిగారు.

మ: ఆ పనులు వానిపాటి కవి సాగనీ. శుద్ధాత్మనవి బాధించవు.

# భాషణములు 112

పాల్ బ్రంటన్ ఉపదేశమంజరిని చదువుతుండగా జీవుడూ, జగత్తూ, దైవమూ అన్నీ మిథ్యయే యన్న వాక్యం కంటబడింది. శ్రీభగవాన్ దానిని ఇలా చెప్పేరు. దైవమంటే సమష్టి, అంటే ఉన్నదంతా + ఉండుట. ఎలా అంటే, 'నేను' అంటే వ్యక్తి + ఉండుట. ప్రపంచము అంటే నానాత్వము + ఉండుట (Being). ఈ ఉండుట అనేది అన్ని సందర్భాలలోనూ నిజం. కాని నానాత్వం, మొత్తం లేదా వ్యక్తి అనేవి మిధ్య. (అంటే ఈ “ఉండుట” అనే దానిమీద ఆధారపడ్డవి. సత్యంగా వానికి అస్థిత్వం లేదు) అలాగే సత్యము, మిథ్య కలయిక. ఈ కలయిక, ఈ తప్పుగా గుర్తించడం అనేవి తప్పులు. అది ఎలా అంటే, "సత్- అసత్ విలక్షణం” అంటే సత్ మరియు అసత్ లను దాటినది, భిన్నమైనది. సత్యం (పరమసత్యం) అన్ని సిద్ధాంతాలకు అతీతము, భిన్నము. భగవంతుడు అనే సిద్ధాంతానికి కూడా అది అతీతమే. దైవానికి పేరు పెట్టడం జరిగిందంటేనే అది సత్యం కాజాలదు. హీబ్రూలో జహోవా అంటే 'నేను ఉన్నాను' (Iam) అనేది దైవాన్ని సరిగా చెప్తోంది. పరమమైన ఉనికి, ఉండుట (Absolute Being) అనేది అన్ని రకాల వర్ణనలకు అతీతము.

దీనికి వేరే పదం ఇవ్వలేము. ఆ అవసరం కూడా లేదు. ఆ ఆంగ్లేయుడు ఇంకా ఇలా అన్నాడు. పురాతనకాలంలో ఆధ్యాత్మికత ఉంది కాని, వృద్ధిపొందిన బుద్ధిలేదు. కాని ఇప్పుడు బుద్ధి వృద్ధి పొందింది. భగవాన్ అన్నారు అదే 'బుద్ధి' "ఎవరి బుద్ధి" అని ప్రశ్నను తీసుకువస్తుంది అని. దాని జవాబు "ఆత్మని" అంటే బుద్ధి ఆత్మయొక్క పరికరం మాత్రమే. భిన్నత్వాన్ని కొలవడానికి బుద్ధిని ఆత్మవాడుతుంది. బుద్ధి ఆత్మకాదు. అలాగని ఆత్మకు భిన్నంగా ఉండలేదు. ఆత్మమాత్రమే శాశ్వతము. బుద్ధికేవలము తాత్కాలికము. భిన్నత్వము బుద్ధివలన వృద్ధిపొందిందని జనులు అంటారు. బుద్ధి ఎప్పుడూ ఉంది. "ధాతా యథాపూర్వం అకల్పియత్" (సృష్టికర్త అన్నీ అంతకు పూర్వమువలే సృష్టించాడు) రోజు తర్వాత రోజూ నీ విషయమే గుర్తించు. కలలులేని గాఢనిద్రలో బుద్ధిలేదు. కాని బుద్ధి ఇప్పుడు ఉంది. చిన్న పిల్లాడిలో బుద్ధిలేదు. అది వయసుతో పెరుగుతోంది. నిద్రలోనో, చిన్న పిల్లడిలోనో అది బీజరూపంగా లేకపోతే ఎలా వృద్ధి చెందగలదు? ఈ మౌలిక విషయం తెలిసికోవడానికి చరిత్రలోకి ఎందుకు వెళ్ళడం? చరిత్ర సత్యత్వం మనిషి సత్యత్వం మీదే కదా ఆధారపడేది!

# భాషణములు 113

భ: తెలుగు వారొకరు కర్మయోగ విషయం అడిగారు.

మ: రంగస్థలం మీద నటునివలె, మనుజుడు క్రియలాచరించాలి. అన్ని చర్యలకూ ఆధారంగా ఉన్నది 'సత్'. అది జ్ఞప్తియుంచుకో. ఆపైన క్రియాపరుడుకా.

భ: చిత్తశుద్ధిని గూర్చి ఆయనే అడుగగా -

మ: అన్య చింతలను వదలి ఒకే విషయంపై చిత్తాన్ని నిల్పడం, చిత్తశుద్ధి, దాన్నే చిత్తైకాగ్రత అంటారు. ధ్యానం అభ్యసిస్తే మనస్సు శుద్ధమౌతుంది.

# భాషణములు 114

బారన్వాన్ వెల్ థీమ్ - ఓస్ట్రాన్ తూర్పు జర్మనీలోని పలుకుబడిగల కుటుంబాల్లోనివాడు ఇలా అడిగాడు.

భ: ఆత్మజ్ఞానానికి లోకజ్ఞానానికి సామరస్యం ఉండవలెను. రెండూ సమానంగానే అభివృద్ధి చెందాలి. అవునా? మహర్షికిది సమ్మతమా?

మ: అవును.

భ: జ్ఞానలబ్ధికి పూర్వం, బుద్ధి కతీతంగా, వ్యక్తి చైతన్యం ఎదుట లోకపటములెన్నో కదలిపోతాయి. అవునా?

శ్రీభగవాన్ దీనికి తుల్యార్ధమయిన దక్షిణామూర్తి శ్లోకము నుదహరించినారు. ఆ పటములు అద్దంలో ప్రతిబింబముల వంటివి. అద్దమునందెట్లో అట్లే పితృలోకములందును; నీటిలోవలె గంధర్వ లోకములందును; ఛాయా సూర్యకాంతులవలె బ్రహ్మలోకములందును అని భగవాన్ కఠోపనిషద్ వాక్యాన్ని చూపారు.

భ: 1930 నుండి ప్రపంచం మొత్తంలో ఆధ్యాత్మిక జాగృతి కలిగింది. మహర్షి దీని సంగీకరింతురా?

మ: ఆ పరిణతి మీ దృష్టిని అనుసరించి.

భ: మహర్షి నాకు ఆధ్యాత్మిక ఆవేశం కల్పించి, మాటల్లోకాకపోయినా గ్రాహ్యమైన రీతిగా ఏమైనా ఉపదేశింపరా? మహర్షి బదులీయలేదు.

# భాషణములు 115

శ్రీ మోరిస్ ఫ్రిడ్మన్: ఇంతకుముందు ఏమీ కోరకున్నా కొన్ని వింత అనుభవాలు కల్గుతున్నాయి. అవి ఎక్కడినుండి వస్తున్నాయి?

మహర్షి: ఆ కోరిక ఇప్పుడు లేకపోవచ్చు, వలసినంత మేరకు అది ఆ పూర్వముండే వుంటుంది. ఇప్పుడది నీకు జ్ఞప్తి లేకున్నా, క్రమంగా అది ఫలించనే ఫలిస్తుంది. జ్ఞానికి ప్రారబ్ధం మిగిలియుండునంటారే, దాని విధానము ఇలాంటిది. ఇది ఇతరుల దృష్టిలో అనుకో.

# భాషణములు 116

భ: జీవుడు కర్మబద్ధుడట, నిజమేనా?

మ: కర్మ దాని ఫలాల ననుభవించనీ, నీవు కర్తవైనంతవరకు భోక్తవు గూడ కావలసిందే.

భ: కర్మబంధాలనుండి విమోచనమెలా?

మ: అది యెవరి కర్మయో పరికించు; కర్తవు నీవు కావని తెలియవస్తుంది. అప్పుడు నీవు ముక్తుడవౌతావు, దీనికి దైవానుగ్రహము కావాలి. దానికి దైవమును ప్రార్థించాలి, పూజించాలి. ధ్యానించాలి.

నీ ప్రయత్నంలేక జరిగే కర్మ - అయత్నకర్మ, నిన్ను బంధించదు. దేహం కదలికవల్ల, జ్ఞానిసైతం ఏవేవో ఆచరిస్తున్నట్లు కనబడుతుంది. సంకల్పమూ యత్నమూ లేక కర్మ ఉంటుందా? అందరికీ సంకల్పాలున్నాయి. అవి రెండు

విధాలు 1. బంధహేతువులు. 2. ముక్తి హేతువులు. ఆ తొలివానిని మాని, వెనుకటివి అలవరచుకోవాలి. పూర్వకర్మలేక ఫలముండదు; పూర్వసంకల్పం లేక కర్మ ఉండదు. కర్తృభావన ఉన్నంతకాలం ముక్తిగూడ ప్రయత్నం వలన లభించేదే.

# భాషణములు 117

ఒక సింహళ దేశీయుడు: ఆత్మసాధనా మార్గంలో మొదటి అడుగు ఏమిటి? ఆత్మను పొందడానికి భగవాన్ సాయంకావాలి. పుస్తకాలు చదవడం వలన ప్రయోజనం లేదు.

మరియొకరు: అతని కోర్కె, మా అందరిది.

మ: అవునవును, ఆత్మ పుస్తకాలలో ఉంటే అది ఎప్పుడో అనుభూతమయ్యేదే, పుస్తకాల్లో ఆత్మను వెదకేకన్న వింత ఉంటుందా? దాన్ని పుస్తకాల్లో కనుగొనగలమా?

ఒకటి నిజం. పుస్తకాలు ఈ ప్రశ్నలడిగి, ఆత్మను వెదికే భావనను ఇచ్చాయి.

భ: పుస్తకాలు వృథా. వాటినన్నిటినీ కాల్చేయెచ్చు. ఉపయోగపడేవి చెప్పిన మాటా మరియు అనుగ్రహమూ.

అందరూ వారివారికి తోచిన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు, చివరకు మళ్ళీ మొదటి ప్రశ్నకే తిరిగి వచ్చారు. కాని శ్రీభగవాన్ మౌనంగా ఉండిపోయారు.

# భాషణములు 118

వేలూరు ఊర్హీ కాలేజీలో తెలుగు పండితులు, శ్రీ రంగాచారి, నిష్కామకర్మ విషయము అడిగారు, బదులులేదు. తరువాత కాసేపటికి భగవాన్ కొండపైకి వెళ్ళారు. వారిని అనుసరించిన కొందరిలో ఆ పండితులూ ఉన్నారు. దారిలో ఒక ముళ్ళకర్ర కనబడింది. భగవాన్ దానిని తీసుకున్నారు; అచటే కూర్చుని తీరికగా దానిని నున్నగా చెక్కడం మొదలుపెట్టారు; ముళ్ళన్నీ తీసివేసి, బుడుపులన్నీ సాపుచేసి, అచట పడియున్న ఎండిన ముదురాకులతో రుద్ది నున్నగా మెరుగుపెట్టారు. అంతా అయ్యేటప్పటికి సాయంకాలం. సుమారు ఆరు గంటలయింది. ఒక ముళ్ళకర్ర అంత నున్నగా తళుకు లీనుతున్నది చూచి అందరూ ముగ్ధులయ్యారు. వారందరూ కదలి వెడుతుంటే దారిలో ఒక గొల్లపిల్లవా డెదురైనాడు. వాడు తన కర్రను పోగొట్టుకొని విచారిస్తున్నాడు. తక్షణమే శ్రీభగవాన్ తన చేతిలో నిగనిగలాడుతున్న ఆ కొత్త కర్రనిచ్చి కదలిపోయారు.

ఆ పండితులన్నారు, నా ప్రశ్న కింతకన్న సదృష్టాంతమైన సమాధానముంటుందా అని.

# భాషణములు 119

ఆశ్రమంలో ఒకప్పుడు నాల్గుకుక్కలుండేవి. తాను స్వయముగా తినకపోతే అవి కూడా ఆహారం ముట్టవన్నారు భగవాన్. పండితులు పరీక్షించారు. వాని ఎదుట ఆహారముంచారు. కాని అవి దానిని తాకలేదు. కొంతసేపైన పిదప భగవాన్ ఆ ఆహారంలో నుంచి చిన్నముద్ద తీసి నోటవేసుకున్నారు. క్షణంలో అవి ఆ ఆహారాన్నంతా తినేసాయి.

# భాషణములు 120

మరికొంతసేపటి కొకరు రెండు నెమళ్ళను తీసుకొని భగవాన్ సన్నిధికి వచ్చారు. ఆ నెమళ్ళకు కన్నులు గంతకట్టి ఉన్నాయి. భగవాన్ ఎదుట ఆ గంతలు విప్పి వానిని వదిలారు. అవి కొంత దూరానికి ఎగిరిపోయాయి. వానిని పట్టి మళ్ళీ భగవాన్ ఎదుట నుంచారు. మళ్ళీ అవి దూరంగా పోయాయి. శ్రీభగవాన్ అన్నారు: 'వానినిచ్చట నిలుప యత్నించటం వృథా. వాని మనస్సు ఆ కుక్కలవలె పక్వం కాలేదు.' వాళ్ళెంత యత్నించినా ఆ నెమళ్ళచ్చట క్షణమైనా నిలువలేవు.

# భాషణములు 121

పూర్వం ఒకమారు శ్రీభగవాను ఇద్దరు ముసల్మానులకు చిన్న సంవాదం జరిగింది.

భ: దైవానికి రూపమున్నదా?

మ: అలా ఎవరు అంటున్నారు?

భ: సరే, దైవానికి రూపం లేనప్పుడు, విగ్రహారాధన చేయవచ్చా?

మ: దైవాన్ని వాని పాటుకు వానిని వదిలేయి. అతన్ని గూర్చి మనకేమి తెలియదు. నీ సంగతి ఏమి? నీకొక రూపం ఉందా?

భ: ఉంది. ఇది నేను, ఫలానా ఫలానా వాడను.

మ: అయితే నీవు కాళ్ళూ, చేతులూ గడ్డమూ మూడున్నర మూర ఎత్తూ అయిన వ్యక్తివి, అంతేనా?

భ: తప్పకుండా.

మ: అయితే గాఢనిద్రలో నీకు నీవట్లే కన్పిస్తావా?

భ: లేచిన తర్వాత నేను నిద్రించానని తెలిసింది. కాబట్టి నిద్రలోగూడ నా దేహం అట్లేనని అనుమానంవల్ల గ్రహిస్తాను.

మ: నీవు దేహానివైతే, చనిపోయాక శరీరాన్ని పూడ్చుటెందుకు? పూడ్చవచ్చిన వాళ్ళతో ఆ దేహం ఒప్పుకోకూడదుకదా?

భ: అటుకాదు. నేనీ స్థూలదేహంలోని సూక్ష్మజీవుడ్ని.

మ: అంటే నీకు నిజంగా ఆకారం లేదన్నట్లేనా? ప్రస్తుతం మాత్రం నీవు ఈ దేహమనుకుంటున్నావు. నీకు ఆకృతి ఉంది గదా? నీకు ఆకారం ఉన్నంతకాలం నిరాకారుడైన దైవాన్ని సాకారుడుగా పూజిస్తే వచ్చే నష్టమేమిటి? అతడేమీ తోచక తబ్బిబ్బై యూరకున్నాడు.

# భాషణములు 122

క్రిస్మస్ రోజులు. ఆశ్రమంలో జనుల సందడి హెచ్చుగా ఉంది.

భ: ఐక్య చైతన్యాన్ని (unity consciousness) సాధించేదెట్లు?

మ: అదే నీవైనపుడు, సాధించేదేమి? నీ ప్రశ్నయే నీకు జవాబు.

భ: ఆత్మ, అనాత్మ, పరమాత్మ అంటే ఏమిటి?

మ: ఆత్మ, వ్యక్తిపరంగా జీవాత్మ; మిగతా రెండూ స్పష్టమే. ఆత్మ ఎప్పుడూ ఉన్నది. ప్రతివాడూ ఆత్మనెరుగ గోరేవాడే. తన్ను దాను తెలిసికోవటానికి, ఇతరుల సాయం, అదెట్టిదైనా, ఎందుకు? ఆత్మయేదో సరిక్రొత్తది అనుకుంటారు. కాని అది నిత్యము, అనాదిగా ఏ మార్పూలేక, అట్లే ఉన్నది. అదేదో ఉజ్జ్వల తేజంగా కనబడాలని ఉబలాటం. అది వీలవుతుందా? అది తేజం కాదు. చీకటి గాదు. (నతేజో, న తమః) ఉన్నట్లే ఎప్పుడూ ఉంటుంది. దాన్ని నిర్వచింప సాధ్యం గాదు. నిర్వచిస్తే, అత్యుత్తమమైనది 'నేనదే నేను (అయామ్ దట్ అయామ్). అది అంగుష్టమాత్రమనీ, కేశాగ్ర ప్రమాణమనీ, మెరపురవ్వ వంటిదనీ, విపులమనీ, అణువులలో అణువుగతియనీ, ఎన్నెన్నో విధాల ఉపనిషత్తులు వర్ణించినవి. కాని వీటికే ఆధారం లేదు. అది కేవల స్థితి (ఉనికి), సత్తుగాదు, అసత్తుగాదు; అది జ్ఞానము; కాని తెలియడం తెలియకపోవడానికి భిన్నం. దాన్ని ఏ విధంగానూ నిర్వచించలేము. అది కేవల స్థితి; అంతే.

తాయుమానవర్ రచనలో, శ్రీ భగవాన్ హెచ్చుగా మెచ్చిన ఒక పద్యంలో ఇట్లున్నది; అహంకారం అంతరించగానే తక్షణమే వేరొక 'అహమహం' స్ఫూర్తి తానై విరాజిల్లుతున్నది'. అట్లే 'స్కందరనుభూతి'లో 'సత్యం కాదు, మిథ్యాకాదు; చీకటిగాదు, వెలుగూ కాదు, అది ఉన్నది'.

ఒక వ్యక్తి ఇలా అన్నాడు: పరమతత్త్వమును మాత్రమే ప్రతిపాదించి వ్యావహారిక జీవితాన్ని శ్రీ శంకరాచార్యులవారు పట్టించుకోలేదు. ఈ లోపాన్ని కుంభకోణంలోని ఒక సిద్ధుడు సరిచేసాడుట. వ్యక్తి సంపూర్ణుడు కావాలంటే సాధారణ జీవితంలో కూడా అతి మానుష శక్తులను ఉపయోగించడానికి సమర్థుడుగా ఉండాలి. అంటే అతడు సిద్ధుడుగా ఉండాలి.

సిద్ధులన్నిటినీ ఖండిస్తూ, తాయుమానవర్ రచించిన పద్యాన్ని భగవాన్ ఉదహరించారు. తాయుమానవర్ ఎన్ని తావుల్లోనో, మౌనాన్ని ప్రస్తావించారు గాని మౌనమిదియని చెప్పలేదు. కేవలం ఒకే యొక పద్యంలో ఇట్లన్నారు; అహంకారం నశించిన వెంటనే మౌనం తానుగా పుడుతుంది. ఆ స్థితి వెలుగు చీకట్ల కవ్వలిది; అయినా తగిన ఇతర పదములులేక, దానిని వెలుగనే పేర్కొన్నారు."

# భాషణములు 123

అలహాబాదు విశ్వవిద్యాలయంలో ఉర్దూ, పారశీ ఆచార్యులు డాక్టరు మొహమ్మదు హాఫీజ్ సయ్యద్. మహర్షి నడిగాడు:

భ: బాహ్యమైన అవతారముయొక్క ఉద్దేశ్యమేమి?

మ: ఈ అవతారమే నీ ప్రశ్నను ప్రేరేపించింది.

భ: నిజమే. మాయ నన్నావరించి ఉంది. ఆ ఆవరణనుండి ముక్తి ఎలా?

మ: మాయావరణం ఎవరికి, ఎవరా ముక్తి కోరేవారు?

భ: స్వామీ! 'ఎవరు?' అని అడిగితే, ఇంద్రియాలతో మనోదేహాలతో విషయాలతో సతమతవౌతున్న అజ్ఞానిని నేను. పాలంటన్ పుస్తకం చదివాక 'నేనెవ'రన్న విచారణ కొంత చేసి చూసాను. మూడునాల్గుసార్లు ఎదో చిత్తోల్లాసం కల్గింది కాని, అది కొంతకాలానికి పోయింది. 'నేను'లో నిలువగల్గేదెలా? ఆ ఉపాయమేమో తెలిపి నాకు సాయం చేయండి.

మ: క్రొత్తగా కనిపించేది మాయమవక తప్పదు.

భ: ఆ నిత్యసత్యాన్ని చేరేదెట్లో సెలవీయండి.

మ: అది నీవే. నీ వెప్పుడైనా ఆత్మకు వేరుగా ఉండగలవా? నీవు నీవుగా ఉండటానికి యత్నమేమి? నీవెప్పుడూ నీవే.

# భాషణములు 124

ఓర్పులేని మరొకడు, సుదీర్ఘంగా ఏమేమో మాట్లాడి చివరకు అడిగాడు.

భక్తుడు: కొందరు చిన్నపిల్లలు అకాలంగా చనిపోతారు. ఎందువల్ల? ఈ చూస్తూన్న పెద్దలను తృప్తిపెట్టే పనిలేదు. బలియైపోతున్నారే ఆ పిల్లల కాశ్వాసంగా బదులు ఈయండి.

మహర్షి: బలియైపోతూన్న వారడగరేం? వారి పక్షాన సమాధానం నీవు కోరడమేం?

# భాషణములు 125

డా. సయ్యద్: ఇక్కడ ఉన్నప్పుడు నా మనస్సు సాత్వికంగానే మెలుగుతుంది. ఈ పరిసరాలొక్కమారు వదిలితినా, అది కోరే విషయాలన్నీ యిన్నీ కావు.

మహర్షి: విషయాలూ నీవూ వేర్వేరా? కర్తలేకపోతే విషయాలెక్కడ?

భ: అది తెలిసేదెట్లా?

మ: అదే నీవు. నీవు తెలియగోరేదేమి? ఆత్మలు రెండా, ఒకటి నింకొకటి తెలుసుకోడానికి?

భ: మళ్ళీమళ్ళీ అదే అడుగుతున్నాను. సత్యం గ్రహించేదెలా? అది గ్రహించి అనుభవంలోకి తెచ్చుకొనేదెలాగ?

మ: క్రొత్తగా సంపాదించవలసిందేమీలేదు. ఆత్మను గూర్చిన నీ అజ్ఞానం త్యజించడమే కర్తవ్యము. అనాత్మ నాత్మగా భావించటమే ఈ అజ్ఞానం.

భ: అవును. కాని ఇప్పటికీ ఇది నా కర్థం కావటం లేదు. శ్రీ భగవాన్ సహాయం కావాలి. ఇక్కడ ప్రతివ్యక్తి మీ అనుగ్రహానికై నిరీక్షిస్తున్నాడు. మొదట తాము కూడా ఏ గురుసాయమో దైవసాహాయ్యమో అర్థించే ఉంటారు. ఆ అనుగ్రహాన్ని కాస్త యితరులపైగూడ చూపి, నన్ను రక్షించండి.

ఇక్కడికి రాక పూర్వం, మహర్షి దర్శనం ఎంతగానో కోరాను. కాని వీలు చిక్కనే లేదు. బెంగళూరు వెళ్ళి అటనుండి తిరిగి మా ఊరికే వెళ్ళి పోవాలనుకున్నాను. కాని అక్కడ ఫ్రీడ్మన్ను మరికొందర్ని కలుసుకున్నాను. వారు నన్నిక్కడికి పంపిచారు. నన్నిట్లు లాగుకొని వచ్చింది శ్రీభగవాన్. బొంబాయిలో పాలంటన్కూ ఇలాగే అయింది. ఇంగ్లండు వెళ్ళడానికన్నీ సిద్ధపరచుకొన్న వానిని అవన్నీ మాన్పి ఇక్కడి కీడ్చితేలేదా?

ఇక్కడికి వచ్చిన క్రొత్తలో కొంత సంశయించాను. తమ సన్నిధికి వచ్చి మాట్లాడనిస్తారో లేదో అని. కాని ఇక్కడికి రాగానే సందేహాలన్నీ తొలగిపోయాయి. ఇక్కడ అందరూ సమానులే. మీరిక్కడ సమతను ప్రతిష్ఠించారు. తమతో, యితరులతో కలిసి భుజించాను. ఇట్లని మా ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో మా వాళ్ళతో చెప్పితే వాళు నమ్మరు. బ్రాహ్మణులు నాతో కలిసి నీరు త్రాగరు. నాతో కూడ తాంబూలం సైతం సేవించరు. అట్టి నాలాంటి వాళ్ళను తాము తమ అనుయాయ వర్గంలో తీసుకున్నారు. ఎంతగా శ్రమిస్తున్నా గాంధీజీ, దేశంలో ఇట్టి మార్పు తేగలడని నేను నమ్మను. తమ సన్నిధిలో నేనెంతో హాయిగానున్నాను.

మీరు నాకు దైవమే. శ్రీకృష్ణులొక్కరే నిజంగా దైవమని నా భావన. వారన్నారు గదా "ఎవరెవర్ని పూజించినా వారు నన్నే పూజిస్తారు. వారిని నేను రక్షిస్తాను" అని. ఇతర మతములలో ప్రతివారు- ముక్తి తన యొక్కరి ద్వారానే - అని ఘోషించినవారే. శ్రీ కృష్ణులొక్కరే అంతటి ఉదారులు; నిజంగా దైవానికి తగ్గట్టు పలికారు. ఆ సమత్వమునే మీరూ పాలిస్తున్నారు.

# భాషణములు 126

సయ్యద్: 'ఆధ్యాత్మిక ఉన్నతికై అవలంబించవలసింది ప్రవృత్తి మార్గమా, నివృత్తి మార్గమా?

మ: నీవు ఆత్మకు దూరం కాగలవా? నివృత్తి అంటే అర్థం ఏంటి?

ఒక అమెరికన్ ఇంజనీరు: సత్సంగము గురించి అడిగాడు.

మ: సత్ మనలోనే ఉన్నది.

భ: 'నేనెవ్వ'రన్న పుస్తకంలో మనస్సుకు స్థానం హృదయమన్నారు. అది అట్లేనా?

మ: మనస్సే ఆత్మ.

భ: అది స్వయమాత్మయేనా? ఆత్మప్రసరింపజేసిందా?

మ: రెండూ ఒక్కటే.

భ: పాశ్చాత్యులు మనస్సు నత్యుత్తమ తత్త్వంగా భావిస్తారు. ప్రాచ్యులు దానికి విరుద్ధంగా భావిస్తారు. ఎందుకు?

మ: మానసికం (సైకాలజి) అంతమైన స్థానంలో తాత్త్వికం మొదలు. ఇది అనుభవం. మనస్సు పుడుతుంది. అది మనం చూచేదే. మనస్సు లేకున్నా మన మున్నాము. అందరి అనుభవమే దానికి ప్రమాణము.

భ: గాఢనిద్రలో నే నున్నట్లు అనిపించదు.

మ: లేచిన తర్వాతే నీవట్లనడం. ఇపుడూ మాట్లాడేది మనసే. నిద్రలో నీవు మనస్సు కతీతంగా ఉన్నావు.

భ: పరమాత్మ మనస్సును శాసించగలదని పాశ్చాత్య తత్త్వశాస్త్రం ఒప్పుకొంటుంది.

# భాషణములు 127

అమెరికన్ ఇంజనీరు: దూరంవలన అనుగ్రహానికేమైన ఆటంకమా?

మ: కాలదేశాలు మనలోనివి. నీవెప్పుడూ నీయాత్మలోనే ఉన్నావు. కాలదేశములు దాన్నెట్లు బాధిస్తాయి?

భ: రేడియోలో దాపున వారికి త్వరగా వినిపిస్తుంది. తాము హిందువులు, మేము అమెరికనులము. అందువలన వ్యత్యాసముండునేమో అని.

మ: ఉండదు.

భ: కొందరు, లోని ఆలోచనలను గూడ సులువుగా గ్రహిస్తారు.

మ: అదే అందరొక్కటని తెల్పుతోంది.

# భాషణములు 128

ఆశ్రమానికి అమెరికనులు, ఫ్రెంచి స్త్రీలూ, పురుషులూ వచ్చారు. వారెన్నెన్నో ప్రశ్నలడిగారు. వానిలో నొకటి -

భ: పశ్చిమ ప్రపంచానికి ప్రాచ్యమిచ్చే సందేశమేమి?

మ: అందరూ ఒకే గమ్యం చేరుతారు.

మరొక ప్రశ్నకు శ్రీ భగవానిచ్చిన సమాధానం

మ: 'నేనున్నాను' అంటావు. అదెట్లు? ఏదైన దీపం వెలిగించి దాని సాయంతో నిన్ను వెదికావా? లేక పుస్తకాలు చదివి తెలుసుకున్నావా? ఏ విధంగా కనిపెట్టావు?

భ: అనుభవం వల్ల.

మ: అవును. అనుభవం అన్నది సరియైన పదం. కాని అనుభవానికి అంతం లేదు, అది నిత్యము. జ్ఞానం కర్త, కర్మలను సూచిస్తుంది.

# భాషణములు 129

వయసు పండిన వారొకరు, పూర్వము శ్రీ బి.వి. నరసింహస్వామితో కలసి పనిచేసినవారు, విశిష్టాద్వైతముపై కొన్ని గ్రంథములు రచించిన వారు, ఆశ్రమానికి అదే మొదట రావటం, పునర్జన్మ విషయంలో శ్రీభగవాన్ను ప్రశ్నించారు -

భ: లింగశరీరము (సూక్ష్మ శరీరము) లయించి, చనిపోయిన రెండేండ్లలో మరల జన్మించటం సాధ్యమా?

మ: తప్పకుండా, మరల పుట్టడమే గాదు, ఆ రెండేండ్లకే, క్రొత్త శరీరంలో ఇరవై, నలభై, డెబ్బైయేండ్ల ముదుసలిగా గూడ జన్మించవచ్చు.. దీనికి యోగవాసిష్ఠంలోని లీలగాథ ఉదాహరణ అంటూ శ్రీ భగవాన్ ఆ కథ చెప్పారు.

"శ్రేయోహిజ్ఞానం అభ్యాసాత్, జ్ఞానాత్ ధ్యానమ్, ధ్యానాత్ కర్మ ఫలత్యాగః" పై వాక్యంలో జ్ఞానం అంటే, అనుష్ఠానము లేని జ్ఞానము; అభ్యాసమంటే జ్ఞానంలేని అనుష్ఠానము, ధ్యానమంటే జ్ఞానం తోడి అనుష్ఠానం.

“అనుష్ఠానం లేని జ్ఞానం, జ్ఞానం లేని అనుష్టానం కంటె మేలు, అనుష్ఠానం లేని జ్ఞానం కంటె, జ్ఞానముతోడి అనుష్ఠానం ఉత్తమం. కర్మఫల త్యాగం- జ్ఞాని యొనర్చే కర్మ, నిష్కామకర్మ - ఫలమాసించని పని -జ్ఞానంతోడి అనుష్ఠానం కంటె ఎంతో ఉత్తమము.

భ: యోగానికీ ప్రపత్తికీ గల భేదమేమి?

మ: ప్రపత్తి (శరణాగతి) భక్తియోగం, "నేను-ఆలోచన" మూలాన్ని చేరడమే. అహంకార వినాశము అదే. గమ్యప్రాప్తి అదే. ప్రపత్తీ జ్ఞానము మొదలైనవన్నీ.

# భాషణములు 130

శ్రీరామకృష్ణ మిషన్కు చెందిన లక్ష్మణ బ్రహ్మచారి.

భ: నేనెవరనే విచారము, కాక నేనన్న తలపు- అది గూడ తలపేగదా? విచారక్రమంలో అది నాశమౌట ఎట్లు?

మ: అడవిలో రాముడు ఋషులలో ఋషివలె ఉన్నాడు. ఋషిపత్నులందరూ సీతను వీరిలో నీ పతి యెవ్వరని గ్రుచ్చి గ్రుచ్చి అడిగారు. వారా ఋషుల నొక్కక్కరినే చూపుతూ రాగా, సీత 'కాదు, కా'దంటూ ఉంది. రాముని చూపగానే మౌనంగా తలవంచింది. ఆ మౌనమే వాగ్ధాటిగల సమాధానము.

ఆ రీతిగానే 'నేతి-నేతి' ఘోషించిన వేదాలు ఉన్నట్టుండి మూగలైనవి. ఆ మౌనమే సత్యస్థితి. మౌనవ్యాఖ్య అర్థం ఇది. 'అహం స్ఫురణ మూలం చేరగానే ఆ తలపూ మాయమౌతుంది, మిగిలిందే ఆత్మ.'

భ: పతంజలి యోగసూత్రాల్లో సాయుజ్య ప్రస్తావన ఉంది.

మ: బ్రహ్మముతో సాయుజ్యము, అహంకార నాశనానికి మరొక పేరు.

# భాషణములు 131

శ్రీ సుబ్బారావు: 'ముఖ్యప్రాణమేమి?'

మ: అహంకారము ప్రాణములు పుట్టుచోటు. ఒక్కొక్కపుడు దాన్నే కుండలిని అనడం కద్దు. చిత్ ఎన్నడూ పుట్టేదిగాదు. అది ఎప్పుడూ ఉండేది. అహంకారానికి పుట్టుకవుంది. ఇతర తలపులకూ అట్లే. శుద్ధ చిత్ సంపర్కం కలుగగానే అవి ప్రకాశిస్తాయి. మరోవిధంగా గాదు.

భ: మోక్షమంటే ఏంటి?

మ: నువ్వు జన్మించలేదని తెలుసుకోవడమే మోక్షం.

“నిశ్చలంగా ఉండు. నేను బ్రహ్మమని తెలుసుకో". నిశ్చలంగా ఉండడమంటే ఆలోచనలు లేకుండా, అని, “తెలుసుకో", "తలపులు మాను” అన్నది ప్రధానం.

భ: రొమ్ములో వేర్వేరు రంగులుగల, ఆరు అవయవాలున్నాయని, మధ్య భాగానికి కుడివైపు రెండు వ్రేళ్ళ వెడల్పు దూరంగా, హృదయం ఉందని అంటారు. కాని ఈ హృదయానికి రూపం లేదు. దానికొక రూపు కల్పించి ధ్యానించవలెనా?

మ: కూడదు. అవసరమైనది 'నే నెవరన్న విచారమే. గాఢనిద్రలోనూ తర్వాతి మెలకువలోనూ, మిగిలియున్నది ఒకటే. కాని మెలకువలో దుఃఖం దాన్ని తొలగించే యత్నం ఉంటాయి. నిద్రనుంచి లేచిందెవరంటే 'నే'నంటావు. నీకు చెప్పేదింతే; ఆ 'నేను'ను గట్టిగా అంటిపెట్టుకో. అది చేస్తే చైతన్యం తానుగా తెలుస్తుంది. ప్రధానం ఆత్మవిచారం, హృన్మధ్యాన్ని ధ్యానించడంగాదు. అంతరమనీ, బాహిరమనీ, ఏవీ లేవు; రెండూ సమానార్థాలు, లేదా అర్థమేలేదని అనవచ్చు.

అలాగే హృదయ మధ్య భాగాన్ని ధ్యానించడమూ ఉంది. అది అనుష్ఠానమే గాని విచారం గాదు. విషయాలోచనల మాని మనస్సెపుడు నిష్క్రియము, నిశ్చలము అవుతుందో, హృన్మధ్యాన్ని ధ్యానించే వానికి తెలుస్తుంది. ఇతర స్థానాలపై ధ్యానించే వారికి అది కేవలం అనుమాన ప్రమాణం ద్వారానే తెలుస్తుంది. అది గూడ మనస్సు మళ్ళీ క్రియా ప్రవృత్తం అయ్యాకనే.

# భాషణములు 132

ఒక చదువుకున్న వ్యక్తి: కేవల స్థితి అనేది ఉన్నదా? దానికి వ్యావహారిక స్థితికీగల సంబంధమేమిటి?

మ: ఆ రెండూ వేరా? అన్ని ప్రశ్నలూ మనస్సులోనే పుడతాయి. మెలకువతో మనస్సు లేచి, గాఢనిద్రలో అణగిపోతుంది. మనస్సున్నంత వరకే ఇన్ని ప్రశ్నలూ, సందేహాలు.

భ: ఆత్మ సాధనా యత్నంలో పురోగతిని సూచించే దశాక్రమమేదైన ఉన్నదా? సత్యంలో తరతమాలుండునా?

మ: తారతమ్యాలు సత్యానికి లేవు, జీవుని అనుభవాల్లోనే అలాంటివి అన్ని క్రొత్తగా లభించేదైతే, అది నష్టం కావచ్చు. కాని సత్యము ఇపుడూ, ఎప్పుడూ ఉండేది.

భ: అయితే అది ఎందుకు తెలియడం లేదు? ఆ ఆవరణ ఏంటి?

మ: తెలియదని దెవరికి? తన్నేవో తెరలు కప్పివేశాయని ఆ పరతత్త్వం నీతో చెప్పిందా? జీవుడే అనేది, ఆ పరతత్త్వాన్ని ఏదో కప్పివేసిందని.

ఈ తెలియకపోవడం ఎవ్వరికనో విచారించి చూడు.

భ: పూర్ణతలో ఈ వైకల్యమెందుకు వచ్చినట్లు? పరమము సాపేక్షికం ఎలా ?

మ: ఎవరికీ సాపేక్షము ఎవరికీ వైకల్యము? పరమము వికలము గారు; అదేమని అడుగదు. అచేతనం ప్రశ్నించలేదు? ఈ రెంటికీ నడుమ ఏదో పుట్టుకొచ్చింది. ఈ ప్రశ్నలన్నీ దానిమూలాన. అదే ఇంత కలవరానికి కారణం. అదేమి? ఇపుడు కొత్తగా జనించిందా? ఎపుడూ ఉన్నదేనా?

నీవు పూర్ణుడవు; అపూర్ణుడవని అనుకోవలదని అన్ని మతాలూ ఘోషిస్తాయి. అనుభవంలో భేదాలెన్ని ఉన్నా, అనుభవించేవాడు ఎపుడూ ఒక్కడే. 'నేను' పూర్ణము. నిద్రలో అపూర్ణత్వము, భిన్నత్వము లేవు. అది చాలు అది పూర్ణమనడానికి.

భ: నేను పూర్ణుడనైతే నే నెందుకలా భావించలేకున్నాను?

మ: నిద్రలో వైకల్యం జాడలేదు. నిద్రలో 'నేను' పూర్ణుడే. మేల్కొన్న 'నేను' అసంపూర్ణత భావించుటెందుకు? నిజానికి, ఆ అసంపూర్ణతను అనుభవించేది మిథ్యా భావన, అది ఒక కల్తీ మొలక, అనంతానికి భిన్నము, దైవ దూరము.

భ: మూడవస్థల్లో నేను ఆ ఒక్కడనే గదా అయినా నన్ను అహంకారం ముంచివేసిందా, కాక నేనై దానివలలో చిక్కుపడ్డానా?

మ: నీవు లేక నీకేదిగాని జరుగునా?

భ: అవస్థ లన్నిటా నేను సముడనే గదా?

మ: అది కనుగొన్నావు గనుకనే అహంకారం రావటం గమనించావు. ఈ కష్ట నిద్రలో నీ పెరుగవే. ఇపుడు క్రొత్తది ఏమి?

భ: ఇంద్రియాలు, మనస్సు,

మ: అట్లనేది ఎవరు? నిద్రించేవాడా? అయితే నిద్రలోనే ఆ ప్రశ్న నడిగియుండవలె. నిద్రలో ఇవన్నీ లేవు. ఇప్పుడు తప్పు అభిప్రాయం తనను పరమమునుండి వేరు అని భావించి మాట్లాడుతోంది.

పూర్ణమూ, నిత్యమూ దానితోనే ప్రమేయమూ లేక క్రొత్తయేమైనా కల్గునా? ఈ వివాదము గూడ అనాదినుండి వస్తున్నదే. ఆ ప్రసక్తి మాని, అంతర్ముఖుడవై, అన్ని బెడదలూ వదల్చుకో. వాదనల ద్వారా ఈ విషయాలు ఇదమిద్ధంగా నిర్ణయించలేము.

భ: సర్వబాధా నివారకం అయిన భగవదనుగ్రహం ప్రసాదించండి. నేను వాదనకు రాలేదు. నేర్చుకోవడానికే వచ్చాను.

మ: నీవేమిటో నేర్చుకో, అదీ మొట్టమొదట నీవు చేయవలసింది. దీనికి శాస్త్రాలూ, పాండిత్యమూ అక్కరలేదు. ఇది చాల సరళమైన అనుభవం. ఉన్నస్థితి ఎప్పుడూ నిరంతరం ఉన్నదే. నిన్ను నీవు మాని, మార్గానికై ఇతరులను నాశ్రయిస్తున్నావు. వేదాంత ప్రయోజనం నిన్నంతర్ముఖుని జేయటమే. 'నీవు నీ యాత్మను తెలుసుకుంటే, నీకే చెడుగూ కలుగదు. నీ వడిగావు గనుక చెబుతున్నాను.

నీ (ఆత్మ) ఆలంబనతోటే అహంకారం పుడుతుంది. నీతో నీవు ఉంటే అహంకారం మాయమౌతుంది. అంతవరకూ జ్ఞాని పలుకుతూనే ఉంటాడు. “అదిగో అచ్చటే ఉంది" అని. అజ్ఞాని అడుగుతూనే ఉంటాడు “ఎక్కడ” అని,

భ: కీలకం "నిన్ను నీవు తెలుసుకో"లో వుంది.

మ: అవును. అంతే.

# భాషణములు 133

అద్వైతంలో రెండు శాఖలు - 1. దృష్టి సృష్టి (సద్యోస్సృష్టి) 2. సృష్టి దృష్టి (క్రమసృష్టి) అని రెండు వాదములు.

తాంత్రికాద్వైతము మరొకటి. అది మూడు ఆధారాలను అంగీకరిస్తుంది జగత్, జీవ; ఈశ్వర, ప్రపంచము; ఆత్మ, దైవము - ఈ మూడూ సత్యాలే. కాని వాటిని కలిపినా, అది పూర్ణసత్యం గాదు. సత్యం వాటిని మించికూడా విస్తరించేది. తాంత్రికాద్వైతమది, సత్యానికి అవధిలేదు. ఆధార సత్యాలు మూడు పరసత్యానికి (పరమాత్మకు) వేరుగా నిలువలేవు. సత్యం సర్వవ్యాపి. ఇది అందరొప్పుకున్నదే. ఈశ్వరుడు జీవునిలో వ్యాపించియున్నాడు. కాబట్టి జీవుడు నిత్యుడు. అతని జ్ఞాన మపరిమితం. కాని అది పరిమితమని వాని యూహ. నిజంగా వాని జ్ఞానం అనంతము. దాని పరిధి నిశ్శబ్దము. ఈ సత్యాన్ని ప్రకటించినవారు దక్షిణామూర్తి. ఈ మూడు ఆధారాలను చూస్తూనే ఉన్న వ్యక్తికి అవి మూడూ సత్యాలే. అహంకారంతో పాటే అవి.

నిజమే. దేవవిగ్రహ శిల్పాలను సూక్ష్మాతిసూక్ష్మాంశాలతో వారు వివరించారు. ఆ వర్ణన పరసత్యాన్ని సూచిస్తుంది. కాకపోతే ఒక్కొక్క అంశానికీ గల విశిష్ట సార్థక్యాన్ని వారు వివరించి యుండరు. నీవే యోచిందు. విగ్రహము ఒక ప్రతీక. సత్యము నామరూపాల కవ్వలిది. శైవ సిద్ధాంతానికి వేదాంతానికి గూడ పరమ గమ్యము ఆ సత్యమే. కాకుంటే అద్వైత వేదాంతానికి ఉత్తమోత్తమ ప్రవర్తకులు శ్రీ శంకరులు దేవతా స్తుతి చేస్తారా? తెలిసే, వారట్లు చేశారనడం స్పష్టమే.

భక్తుడు: బహాయి సాహిత్యం చదివిన, తర్వాత, శైవ సిద్ధాంత వేదాంతాదులలో నా నమ్మకం సడలిపోయింది. నన్ను రక్షించండి.

మహర్షి: ఆత్మ ఇప్పుడూ, ఇక్కడే ఉంది; దాన్ని తెలుసుకో, సుస్థిరుడవౌతావు. అటుపై చలించవు.

భ: బహాయ్ మతానుయాయులు ఇతరుల ఆలోచనలను చదువుతారు.

మ: కావచ్చు. అది సాధ్యమే. నీ ఆలోచనలను నింకొకడు గుర్తించాడు; నీ మనస్సు తెలిసినవాడొకడుండాలి కదా? అనుభవించి తెలియవలసిన సత్యం, అదే. అది నిశ్చయం.

భ: అనుగ్రహం చూపించండి.

మ: అనుగ్రహం ఎప్పుడూ ఉంది. ఇచ్చేది గాదు. బహాఉల్లా, తదితరులూ అవతారాలనీ, అవుననీ, కాదనీ తర్కమెందుకు? నిన్ను నీ వెరుగు. సర్వమూ సత్యమని నమ్ము. ఆయనగూడ సత్యమే యని గ్రహించు. ఆయన సత్యానికి వెలుపల వుండుటకు తావేది? నీ నమ్మకాలు మారవచ్చు. కాని సత్యం ఎన్నటికీ మారదు.

భ: శైవసిద్ధాంతంలోని పారమార్థిక సత్యం తెలుపుతారా?

మ: వారి యుపదేశాల ననుసరించి చూడు. ఆపైన సంశయాలుంటే అడుగు. ఆ యుపదేశా లనుసరిస్తే నీవు మౌనాన్ని చేరుకుంటావు. అంతవరకే, భేదాలు బాహ్యవిషయాల్లోనే కనుపిస్తాయి. వారి యాదేశాల ప్రకారం నడిస్తే భేదభావనలు నశిస్తాయి. రాజు కొడుకు కాకుంటే వానిని రాజపుత్రుడనరు. అట్లే పూర్ణమైన దానినే పూర్ణమంటారు.

శిష్యరికం, ఉపదేశం, శరణాగతి లాంటి తంతులంతా బయటి విషయాలు. వాటితో తృప్తిచెందకూడదు. ఆ విషయాలన్నిటికీ మూలాధారమైన సత్యాన్ని మర్చిపోక.

భ: శ్రీ దక్షిణమూర్తి మౌనానకర్థమేమి?

మ: యతులూ, పండితులూ ఎన్నెన్నో వివరిస్తారు. నీకు నచ్చినదేదో గ్రహించు.

## భాషణములు 134

హృదయాన్ని గూర్చి ప్రశ్నను ఎవరో అడిగేరు.

మ: ఆత్మను వెదకి అనుభూతి పొందాలి. హృదయం తనపని తాను చూసుకొంటుంది. దానికెవరి జోక్యం అక్కరలేదు. ఆత్మ అనుభవస్థానం హృదయం. అది లోనున్నదా, వెలుపలనా, నిర్ణయించడం సాధ్యం కాదు.

భ: తమ తొలి ఆత్మానుభవ వేళలో భగవాన కు హృదయ స్పృహ ఉన్నదా?

మ: ఆ తర్వాత ఆ విషయంగా ఉన్న పుస్తకాలను చూచి ఆ మాట వాడటం మొదలు పెట్టాను. నా అనుభవాన్ని పుస్తకాలలో ఉన్నదానితో పోల్చి చూసుకున్నాను.

## భాషణములు 135

దివ్యజ్ఞాన సమాజ సదస్సునుండి ముగ్గురు ఐరోపా స్త్రీలు వచ్చారు.

భ: ఈ సృష్టి క్రమము, దాని విధానమూ నిజంగా సరియైనవేనా? లేదంటే

ఏదో పొరబాటా, దానినుండి చేతనైన మేరకు ఎట్లో సర్దుకుని ఉపయోగించుకోవాలా?

మహర్షి: విధానం నిజంగా మంచిదే. పొరబాటులుంటే అవి మనవి. వానిని మనలో మనమే సరిచేసుకుంటే వ్యూహం అంతా స్పష్టంగా తెలుస్తుంది.

భ: నిద్రలో మనం చేసేదాన్ని గుర్తుపెట్టుకోవడం ద్వారా ఆ వ్యూహం అర్థం చేసుకోవడానికి మీ వద్ద ఏమైనా సూత్రం లేదా పద్ధతి ఉందా?

మ: సూత్రాలేమీ అక్కరలేదు. సుఖంగా నిద్రించాననటం, నిద్రలో మరేమీ ఎరుగ ననటం, అందరి అనుభవంలోనివే. అపుడు దానికి వేరుగా ఏ అనుభూతి ఉండదు.

భ: నాకీ సమాధానం తృప్తిగా లేదు. నిద్రలో మనం సూక్ష్మ ప్రపంచంలో విహరిస్తాము. కాని అది జ్ఞప్తియుండదు.

మ: ఆ నక్షత్ర వీధి విహారాలు కలల ప్రపంచంలోనివి. గాఢనిద్రావస్థవి కావు.

భ: ఈ ప్రపంచ దుఃఖానికి కారణమేమంటారు? దాని నివారింపడానికి సమష్టిగానూ, వ్యష్టిగానూ మనం చేయగల సాయమేమి?

మ: నిజమైన ఆత్మను అనుభవగతం చేసుకో. అది మాత్రం చేస్తే చాలు.

భ: మానవసేవ మరింత హెచ్చుగా చేయాలి. అందుకై జ్ఞానాన్ని తొందరగా పొందడానికి ఏమి చెయ్యాలి.

మ: మనకే మనం సాయం చేసుకోలేకపోతున్నాం. కనుక భగవంతుని శరణాగతి చెయ్యాల్సిందే. అప్పుడీ ప్రపంచంతోపాటు మన రక్షణాభారం కూడా ఆయనే వహిస్తాడు.

భ: ఇంతకూ, గమ్యమేమంటారు?

మ: ఆత్మానుభవం.

భ: ప్రతియొక్కరూ వాని వాని నిర్ణీత గురువును చేరుకొనే ఉపాయమేదైనా ఉన్నదా?

మ: తీవ్ర ధ్యానం చేస్తే అది సాధ్యమౌతుంది.

# భాషణములు 136

డాక్టర్ జి.హెచ్. మీస్ డచ్ యువకుడు. కొద్ది రోజులు ఇక్కడున్నాడు. అతడు ప్రశ్నించాడు.

భక్తుడు: గాఢనిద్రలోని స్థితి సమాధిస్థితి వలె ఉంటుందనుకుంటాను. ఇది సరేనా?

మహర్షి: ఈ ప్రశ్న వేస్తున్నది మేల్కొన్న 'నేను', నిద్రలోని 'నేను'గాదు. మేలుకొనే నీవే ఆ సమాధి సమస్థితి -అంటే జాగ్రన్నిద్రా స్థితి నందగల్గితే, ఏ సందేహాలూ రావు.

సమాధి ప్రతివానికీ సహజస్థితి. మూడవస్థలకూ అది సమానమైన ఆధారము. ఆది ఆత్మ. ఈ అవస్థల లోనిదిగాదు, దాని లోనివి ఈ అవస్థలు. మెలకువలో సమాధిస్థితిలో ఉండగల్గితే, అది నిద్రాస్థితిలోనూ మిగిలి ఉంటుంది. జడము చేతనమన్న భేదము మనోదశకు చెందింది. ఆత్మస్థితి దానికి అతీతమైనది.

భ: జీవాత్మయంటే బౌద్ధుల అభిప్రాయాలు వేరు. సరళమై (continuous) తీగసాగే సత్తు (సత్తా) ఏదీ వారు లేదంటారు. అది సరియేనా? మరి హిందువులు జీవాత్మకు పునర్జన్మ ఉందంటారు. వీనికి సమన్వయమెట్లు? జీవాత్మను, హిందూ సిద్ధాంత ప్రకారం అనేక జన్మల తోడి నిరంతర సత్తా అనుకోవలెనా, కాదు అది కేవలం సంస్కారాల (మెంటల్ టెన్ డెన్సీస్) మూటయేనా?

మ: సత్యాత్మ అవిరళం, నిరుపహతం ఏదీ దానిని తాకలేవు. జీవాత్మ దానికి క్రిందది. పునర్జన్మలున్నది దీనికీ, అంటే అది ఆలోచనల కోవకు చెందినది. ఆత్మస్థితి దాని కతీతం.

పునర్జన్మ ఋజుమార్గంలో వచ్చేది గాదు. అది కృత్రిమాంకురము (స్పురియస్ ఆఫ్ ఘూట్), అందుకే బౌద్ధులు దాన్ని నిరాకరిస్తారు. ఇప్పటి స్థితికి కారణము చిత్ జడముల కలయికయే.

# భాషణములు 137

శ్రీ లక్ష్మణ బ్రహ్మచారి, రామకృష్ణా మిషన్ నుండి తన ఆలోచనలకు తాను సాక్షినని అనుకోవడం సరియేనా?

మహర్షి: అది సహజస్థితి గాదు, భావన మాత్రమే – మనస్సును స్తంభింపజేయడానికి కొక సాధనం. మనం అనుకున్నా, మానినా, ఆత్మ యెప్పుడూ సాక్షియే. అది సాధనగా పెట్టుకుంటే తప్ప, తన తలపులకు తాను సాక్షినని ఊహించడం అనవసరం. తానుగా తానుండటం, అంటే ఆత్మస్థితి, సర్వోత్తమం.

# భాషణములు 138

మైసూరు ఆర్థికశాఖ కార్యదర్శి పాల్ బ్రంటన్ పుస్తకం సీక్రెట్పాత్ (గుహ్యపథము) భారతీయులకు గూడ ఉపయోగపడుతుందా?

మహర్షి: అందరికీ ఉపయోగపడుతుంది.

భ: దేహేంద్రియాలు తానుగానని అందరూ సర్వసాధారణంగా అనేదే. కాని దాన్ని అభ్యసించే దెట్లా?

మ: ఆ పుస్తకంలో చెప్పిన త్రివిధ పంథా ననుసరిస్తే సరి.

భ: ప్రాణరోధము ఆత్మవిచారాని కవసరమా?

మ: ఏమంతగా కాదు.

భ: ఆ పుస్తకంలో "మధ్యలో ఒక శూన్యస్థితి ఉంది" అంటాడు.

మ: నిజమే. అక్కడ ఆగొద్దు. ఆ రిక్తత ఎవరి కగుపించిందో చూడు.

భ: భక్తులకెట్టి రిక్తం లేదట.

మ: అక్కడా ఒక నిద్రాణస్థితి 'లయం' - ఉండనే ఉంది. కొంతసేపటికి మనస్సు తిరిగి లేస్తుంది.

భ: సమాధి అనుభవం అంటే ఏమి?

మ: అది అదిగనే ఉంది. చూచేవారది మూర్ఛయనుకుంటారు. మొదట్లో సాధకునికి గూడ ఆ యనుభవం మూర్ఛగానే తోచవచ్చు. కాని ఆ యనుభవం కాను, కాను, అంతా చక్కబడుతుంది.

భ: ఆ అనుభవం వల్ల నాడులకు ఉపశమంగా ఉంటుందా? కాక ఉత్తేజం కలుగుతుందా?

మ: మొదట్లో ఉత్తేజమే కలుగుతుంది. అనుభవం హెచ్చేకొద్దీ అలవాటుపడి, సాధకుడు దాన్ని పట్టించుకోడు.

భ: మార్గం సరిగాఉంటే అప్రసన్నత ఉండరాదు. సుఖజీవనానికి వర్తనకూ ఉత్తేజం అనుకూలంగాదు.

మ: మనస్సు చలిస్తూంటే, తప్పుదారిలో పడినట్లే, భక్తిపూర్వకమైన వాని మనస్సే సరియైన మార్గంలో పోతుంది.

# భాషణములు 139

లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు, శ్రీ ఎల్లప్ప చెట్టియారు, సేలం: “మనస్సు నంతర్ముఖం చేస్తే చాలునా, కాక 'నేను బ్రహ్మమ'ని ధ్యానం చేయాలా?"

మ: మనస్సు అంతర్ముఖం చేయటం ముఖ్యం. బౌద్ధులు 'నే'నన్న తలపు ప్రవాహికమైతే అదే మోక్షమంటారు; కాని మనం ఏకైక సత్యమే ఆ యోచనా ప్రవాహానికి మూలాధారమంటాము.

తాను బ్రహ్మమని ఎవరైనా ఎందుకు ధ్యానించడం? ముక్తియంటే అహంకార నాశం. కాని 'అహం-అహం' స్ఫురణ దృష్టిలో ఉంటేనే ఆ ముక్తి కలిగేది. ఆత్మవిచారం అందుకే. అహంకారం వదలకపోతే సాధకునికి ఏ రిక్తతా అవుపించదు. లేకపోతే నిద్రలోకి దారి తీస్తుంది ధ్యానం.

ఎప్పుడూ ఉన్నది ఒకే ఒక 'నేను'. మధ్య మధ్య తొంగిచూస్తూ మరుగౌతున్న 'నేను' మిథ్య. కాని 'అహ-మహం' స్ఫురణ, వ్యక్తంకాక పూర్వంగూడ స్వయం దీప్తమే.

స్థూల దేహం పుట్టుక నిజానికి తన పుట్టుక కాదు, తన పుట్టుక నిజంగా అహంకారం పుట్టినపుడే. ముక్తికొరకు క్రొత్తగా సంపాదించేది ఏమీ లేదు. అది ఆది మూలస్థితి. ఎన్నడూ మారబోని స్థితి కూడాను.

# భాషణములు 140

భ: సత్యమంటే ఏమి?

మ: సత్యం సదా సత్యంగానే ఉండాలి. దానికి రూపం లేదు. నామమూ లేదు. రూపనామాలకు గూడ ఆధారం సత్యమే. అవధులు లేకపోయినా అన్ని అవధులకూ ఆధారమదే. అది నిర్నిబంధనము. తాను సత్యమే కాని అన్ని మిధ్యలకూ మూలమూ అదే. ఉన్నదేదో అదే సత్యం; అది అదిగనే ఉంది. అది వాక్కుల కందదు; వర్ణనలకు అందదు అస్తి, నాస్తి మొదలైన ఏ నిర్వచనాలకూ అందదు.

# భాషణములు 141

శ్రీ ఎల్లప్ప చెట్టియార్ కైవల్యం నుంచి ఒక శ్లోకం ఉదాహరిస్తూ అడిగారు:

భ: "ఒకమారు లభించిన జ్ఞానం, తిరిగి నష్టం కాగలదా?"

మ: ఒకమారు కల్గిన జ్ఞానం స్థిరం కావడానికి కొంతకాలం పడుతుంది. ఆత్మ ప్రతి వానికి స్వంత అనుభవమే. కాని అది ఆ వ్యక్తి అనుకొనే రీతిలో కాదు. ఆత్మస్థితి అంటే, ఆత్మ ఉన్నట్లే ఉండడం. ఈ అనుభవమే సమాధి. కొన్ని మంత్రముల వలన అగ్ని అప్పటికప్పుడు కాల్చకుండా ఆగినా, అలా కాకపోతే అది కాల్చి వేస్తుంది. అలాగే వాసనల్లో అణిగి వున్న ఆత్మ ఆ వాసనలు క్షయించగానే ప్రకాశమానం అవుతుంది. వాసనల ఆటుపోటులవలన జ్ఞానం నిలద్రొక్కు కొనడానికి కొంతకాలం పడుతుంది. అస్థిర జ్ఞానం వలన పునర్జన్మలు ఆగవు. వాసనల తాకిడికి జ్ఞానం చలించకుండా ఉండలేదు. కాని సద్గురు సన్నిధిలో వాసనలు మంత్రం వలన కట్టుబడిన అగ్నివలె ఆగి, మనస్సు అణిగి సమాధి సిద్ధిస్తుంది. సద్గురు సన్నిధిలో శిష్యునికి కలిగే సద్విద్య నుంచి అనుభవాలు ఈ రీతివే. అయితే ఆ జ్ఞానంలో నిలబడడానికి ఇంకా అధిక ప్రయత్నం అవసరం. అది జరిగితే సత్యస్థితి అదే అని గుర్తించి అతడు జీవన్ముక్తుడౌతాడు. సమాధిస్థితిలో కళ్ళు మూసుకోవడం మంచిదే. కాని ఇంకా ముందుకుపోయి క్రియా ప్రవృత్తి నిష్క్రియత రెండూ పరస్పరం విరోధులు కావని గ్రహించాలి. కర్మలవల్ల సమాధిస్థితి జారిపోవుననే భయం అజ్ఞాన లక్షణం. సమాధి ప్రతివానికి సహజ జీవితం కావాలి.

మన యత్నాలకూ యత్న రాహిత్యానికి అవ్వలి స్థితి ఒకటుంది. దాన్ని చేరేవరకు యత్నం సాగించవలె. ఆ ఆనందాన్ని ఒకమారైనా రుచి చూడగల్గెనా దానికై మరి మరి యత్నించి తీరుతాడు. పరమశాంతి అయిన ఆనందాన్ని ఒక పరి అనుభవించాక, దానికి దూరంగావడంగాని, వేరే విధంగా ప్రవృత్తుడు కావటంకాని, ఎవ్వనికీ నచ్చదు. తలపులను మానడం అజ్ఞానికెంత కష్టమో, తలపులు పెంచడం జ్ఞానికి అంతే కష్టం.

సామాన్యుడు తన్నుతా నెరుగనంటాడు. వానికెన్ని ఆలోచనలో? ఆలోచించకుండా వాడసలుండలేడు.

ఎట్టి కర్మలైనా సరే, అవి జ్ఞాని నంటవు! వాని మనస్సెప్పుడూ నిత్యశాంతిలో మగ్నమై ఉంటుంది.

# భాషణములు 142

విజయవాడ వాసి, ప్రకాశరావు: బ్రహ్మాకార వృత్తి (బ్రహ్మైక్యాని)కి ముందే మాయ పని చేయడం ఆగదా? లేదా ఆ తర్వాత గూడ ప్రవర్తిస్తూనే ఉంటుందా?

మహర్షి: వాసనాక్షయం పిదప మాయ నిలువదు. వాసనా నాశనానికి బ్రహ్మైక్య బోధకు మధ్యగల విరామంలో మాయ ఉంటుంది.

భ: బ్రహ్మైక్యం తర్వాత గూడ ప్రపంచం బాధిస్తుందా?

మ: మొదట ఆ బ్రహ్మాకారవృత్తి కానీ, అవసరమైతే అప్పుడీ ప్రశ్న అడగవచ్చు. భ: తన వ్యక్తిత్వాన్ని తెలుసుకొన్నట్లే, బ్రహ్మమును గూడ తెలియగలమా?

మ: నీవూ మనస్సూ వేరా? దాన్నే విధంగా తెలియవలెనంటావు?

భ: చిత్త పరిణామమును (చిత్త విలాసమును) పూర్తిగా తెలుసుకోగలమా?

మ: ఓహో! ఇదేనా, మీ బ్రహ్మతాదాత్మ్యము.

అజ్ఞానం అదృశ్యమైతే మిగిలి ఉన్నది వ్యక్తమౌతుంది. అది అనుభవం, విజ్ఞానవిషయం కాదు.

# భాషణములు 143

పాల్ బ్రంటన్: ఇక్కడ ఉన్న అరుణాచల కొండ అంత శూన్యమా? (గుల్లయా)

మ: పురాణము లట్లే అంటాయి. హృదయాన్ని గుహగా వర్ణించారు, లోన జొచ్చినప్పుడు అది తేజోవిరాజితం అని తేలింది. అలాగే ఈ గిరి జ్యోతి రూపం. గుహలన్నీ ఆ తేజస్సుచే కప్పబడి ఉన్నాయి.

భ: లోన గుహలున్నాయా?

మ: నా దృష్టి (విజన్)కి ఎన్నో గుహలు, వీధులతోడి నగరాలు, సువిశాల ప్రపంచమే అందు గోచరించింది.

భ: అచట సిద్ధపురుషులు గూడ ఉన్నారా?

మ: సిద్ధులెందరో ఉన్నారనే ప్రతీతి.

భ: సిద్ధులేనా, ఇతరులు గూడానా?

మ: అంతా ఈ ప్రపంచంలోవలెనే.

భ: సిద్ధులు హిమాలయాల్లో ఉన్నారట.

మ: హిమాలయంపై కైలాసం ఉంది. అది శివ నివాసము. ఈ గిరియో సాక్షాత్తూ శివుడే. ఆయనెక్కడుంటే అక్కడ ఆయన పరివారమూ ఉంటుంది.

భ: ఈ కొండ శూన్యమనీ, అట్టివే ఇతర గాథలనూ భగవాన్ నమ్ముతారా?

మ: ఏదైనా వారి వారి దృష్టిని బట్టి ఉంటుంది. ఒక అనుభవంలో నీవే యీ కొండలో ఋష్యాశ్రమాదులను చూడలేదా? వానిని నీ పుస్తకంలో వర్ణించావే?

భ: నిజమే. అవి యన్నీ కొండపైన అనుభవం నాలోనిదే.

మ: అదే సరి. సర్వమూ మనలోననే ఉంది.

జగత్తును చూచుటకు, చూచు వాడొకడుండాలి, ఆత్మ లేక జగత్తు లేదు. సర్వమూ ఆత్మావాస్యమే (ఆల్ కంప్రెజింగ్) నిజానికి ఆత్మయే సర్వమూ, అదిగాక వేరొక్కటి లేదు.

భ: ఈ గిరి రహస్యమేమిటి?

మ: నీవు గుప్త ఈజిప్టు (సీక్రెట్ ఈజిప్ట్)లో చెప్పినట్లే, పిరమిడ్ తత్త్వరహస్యం,

ఆత్మతత్త్వం రహస్యమే, అట్లే యీ గిరి విషయమునూ,

చాడ్విక్: ఆత్మ అహంకారానికి భిన్నము అన్న విషయం నాకు తెలియదు. మః గాఢనిద్రలో నీవెలా వున్నావు?

భ: నాకు తెలీదు.

మ: ఎవరికా తెలియనిది? మేల్కొన్న 'అహమునకు కాదా? గాఢనిద్రలో నీవు లేనంటావా?

భః గాఢనిద్రలో నేను ఉన్నాను. ఇప్పుడు నేను వున్నాను. కాని నిద్రలోని వానిని నేనెరుగను.

మ: అదే, అదే, మేల్కొన్నవాడు నిద్రలోనిది ఏమీ తెలియదంటాడు. ఇప్పుడు చుట్టూరా విషయములను చూస్తాడు గనుక తా నిక్కడున్నట్లు తెలుసు. కాని నిద్రలో చూచేవాడు లేడు, చూచుటకు విషయములు లేవు. ఇపుడు మాట్లాడేవాడే నిద్రలోనూ వున్నవాడు. ఈ రెండవస్థల్లోని భేదమేమి? నిద్రలో లేని విషయాలు, ఇంద్రియ ప్రవృత్తులూ ఇప్పుడున్నాయి. ఆ రెండవస్థల నడుమ, ఒక క్రొత్త భావం అహంకారం లేచి, ఇంద్రియాల ద్వారా విషయాలను చూచి తాను దేహమని భ్రమించి, అహంకారమే ఆత్మయని చాటుతోంది. నిజానికి నిద్రలో ఉన్నదే, యిప్పుడున్నదీను. ఆత్మకు మార్పులేదు. మధ్య వచ్చింది అహంకారం. ఉబుకుతూ ఉడుగుతున్నది అహంకారం. మార్పులేక నిలిచియున్నది ఆత్మ.

# భాషణములు 144

ప్రకాశరావు: మాయకు మూలకారణమేమిటి?

మ: మాయ అంటే ఏంటి?

భ: తప్పు జ్ఞానము, భ్రాంతి,

మ: ఆ భ్రాంతి ఎవరికి? భ్రమ చెందేవాడొకడుండాలి. మాయ అజ్ఞానము, నీ దృష్ట్యా, అజ్ఞానమైన అహం విషయాలను చూస్తుంది. విషయాలే లేకుంటే మాయ యెట్లుంటుంది? మాయ యంటే "యా, మా" (ఏదీ లేదో, అది) పోగా మిగిలినది ఆత్మ. విషయాలను చూస్తున్నానంటావు. సత్యమైన ఏక వస్తువు తెలియదంటావు. అయితే అక్కడ ఆత్మలు రెండున్నవా - జ్ఞాత (తెలియువాడు), జ్ఞేయము (తెలియనైన విషయము), తనలో ఆత్మలు రెండున్నవని ఎవ్వడూ ఒప్పుకోడు. మేల్కొన్నప్పుడు నిద్రించింది తానేనని, కాని అపుడు తనకేమీ తెలియదని అంటాడు. ఇప్పటి తానూ నిద్రించిన తానూ వేరని అతడనడు. ఉన్నదొకే యాత్మ. అది సదా తెలియునదే. దానికి మార్పులేదు. ఆత్మ కన్యమేమీ లేదు.

భ: గగనవిహారి (astral body) దేహం అంటారే, అదేమి?

మ: కలలో నీకొక దేహం ఉన్నదా? దానికి పడకపై యున్న దేహానికి తేడా లేదా?

భ: మరణించిన పిదప గూడ మనముంటామా? గగనవిహారి దేహం శారీరకమృతి తర్వాత మిగిలి ఉంటుందా?

మ: కలలో నీకు చిత్రవిచిత్రాలైన అనుభవాలు కలుగుతాయి. ఆ తర్వాత మేల్కోవా? అలాగే మృతి తర్వాత, మరో దేహాన్ని ధరిస్తావు.

భ: ఆ గగనవిహారి దేహం, భౌతిక మృతి తర్వాత 40 ఏండ్లు జీవించే ఉండునటనే?

మ: ఇప్పటి ఈ దేహంలోని నీవు, కలలోని దేహం గగనవిహారి యంటావు. స్వప్న దేహంలో నీవట్లన్నావా? ఇప్పుడు గగనవిహారిగా అవుపించేది, అప్పుడు యథార్థంగానే తోస్తుంది. దాని దృష్టితో, యీ యిప్పటి దేహంగూడ గగనంలో విహరించేదే. రెండూ ఆకాశ సంచారులే. వానిలో భేదమేమి? ఏమీ లేదు.

పాలంటన్: సత్యంలో వివిధ దశలున్నట్లేనా?

మహర్షి: కలలోని దేహం ఇపుడు కల్లయనీ, కలగంటున్నప్పుడు యిప్పటి దేహం నిజంకాదనీ, అనడం సత్యంలో వేర్వేరు దశలను తెల్పదు. గాఢనిద్రలో దేహస్పృహయే లేదు. ఎప్పుడూ ఉన్నదొక్కటే, అది ఆత్మ.

# భాషణములు 145

పాల్ బ్రంటన్: మతాలు దేవతల గురించి స్వర్గ నరకాదుల గురించి ఎందుకు చెప్తున్నాయి?

మహర్షి: అవన్నీ కూడా ఇక్కడ ఈ ప్రపంచంతో సమానమనీ, ఆత్మ మాత్రమే నిజమని జనులు తెలుసుకొనేటట్లుచేయడానికి అన్ని మతాలు అలా చెప్తున్నాయి. అన్వేషించే వాని దృష్టినిబట్టి వాని మతం. భగవద్గీత చూడు. రాజ్యానికై అందరు బంధువులను పెద్దలను చంపాలి. అర్జునుడు యుద్ధమాడనన్నాడు. శ్రీ కృష్ణులేమన్నారు. "నేనూ, నీవు, యీ రాజలోకమూ ఇంతకు పూర్వం ఉండనే
ఉంటిమి. ప్రస్తుతమున్నాము. ఇకపై ఉండకనూ పోము. ఒకటి పుట్టినదీ లేదు. చచ్చినదీ లేదు; ఇకపై అట్లే ఉండదనీ లేదు. "ఈ భావాన్నే విస్తరిస్తూ శ్రీకృష్ణులే చెప్పారు. "ఈ యోగాన్నే పూర్వం నేను రవి కెరిగించాను. అతడు మనువునకూ, మనువు ఇక్ష్వాకునకు బోధించారు". అర్జునునికి సందేహం కలిగింది. 'అదెట్లు సాధ్యం? నీవు పుట్టి కొద్ది యేండ్లే గదా అయినవి. వాళ్లు యుగాల పూర్వం వారే?" అప్పు డర్జునుని దృక్పథాన్ని గురించి శ్రీకృష్ణులు వివరించారు; ఎన్నెన్నో అవతారము లెత్తాను. అట్లే నీవు గూడ. కాని వాని నన్నింటినీ నేనెరుగుదును? నీకవి తెలియవు ఈ కథనాలు

పరస్పర విరుద్ధాలుగానున్నా, అడిగేవాని దృష్ట్యా అవి సరియైనవి. క్రీస్తుగూడ తాను అబ్రహాంకు పూర్వమే ఉన్నాననలేదా?

భ: మతంలో అట్టి వర్ణనల ప్రయోజనం ఏమిటి?

మ: ఆత్మ సత్యాన్ని నిరూపించడానికే.

భ: భగవాన్ ఎప్పుడూ అత్యున్నత దృక్పథంతోనే పలుకుతారు.

మ: (చిరునవ్వుతో) సత్యం సరళంగా, సూటిగా చెప్తే ప్రజలు అర్థం చేసుకోరు. సత్యము శాశ్వతమూ సదా ప్రవర్తకమూ, అనుదినానుభూతమూ, దాన్ని పటాటోపం లేకుండా సరళంగా చెప్పితే చాలమందికి నచ్చదు. దాన్ని దాటవేసి, స్వర్గ నరకాలు, పునర్జన్మలూ వీటిని గురించే అన్ని ఉబలాటలూ, వారికి గూఢమూ రహస్యమూ కావాలి.. ఆవరణం లేని సత్యం కాదు. అందువల్ల మతాలు అట్టి కథనాలతో వారిని ముద్దుచేసి, మెల్లిగా క్రమంగా వారి దృష్టి నాత్మవైపు మళ్ళిస్తాయి. ఎన్ని దిక్కుల తిరిగినా, చివరకాత్మ యొక్కటే దిక్కు, దానిలో ఇపుడే ఉన్నచోటనే ప్రతిష్ఠితుడవు కారాదా?

ఇతర లోకాలను తెలియడానికి, ఆత్మ వానిని చూడాలి. లేక ఊహించాలి. వాని నిజం చూచి ఊహించేవాని నిజం పాటిదే. ప్రేక్షకులు లేక ఆ లోకాలు ఉండలేవు. ఆ కారణంగా గూడా అవి ఆత్మభిన్నాలే. ఎంత తెలియనివాడైనా, విషయాలను చూచెటప్పుడు తన ఆత్మనే చూస్తాడు. కాని వాడు కలవరపడిపోయి, ఆత్మను విషయము, దేహము, ఇంద్రియములు అని భ్రమపడి, జగన్నాటకంలో తన పాత్ర నిర్వహిస్తాడు. కర్తా, విషయమూ ఆత్మలో శమించేవే! ద్రష్టా లేడు, దృశ్యాలు లేవు. ఆ రెండూ ఆత్మయే. ఆత్మలు పెక్కులు లేవు. అన్నీ ఒకే ఒక ఆత్మయే.

# భాషణములు 146

ఉన్నత హోదా కల్గి, సంస్కారవతి అయిన భారతీయ మహిళ, కుమారి లీనాసారాబాయి ప్రశ్నకు బదులుగా శ్రీ భగవాన్ అన్నారు:

సమదృష్టి (ఈక్వానిమిటి) ఆనందస్థితియే, 'నేనది' 'నేనిది' యన్న శ్రుతివాక్యం సమచిత్తత్వం సాధించడానికి ఒక సాయం మాత్రమే.

భ: అయితే ఒక లక్ష్యంతో ఏ ప్రారంభమూ సరికాదన్నమాట?

మ: అందుకోవలసిన గమ్యమొకటి ఉంటే అది శాశ్వతం కాదు. గమ్యమంతకు మునుపే ఉండి వుండవలె. అహంకారంతో దాన్ని చేరజూస్తాము. కాని, అది అహంకారానికి పూర్వమే ఉంది. లక్ష్యం మన పుట్టుక, అంటే అహంకారం పుట్టుకకు పూర్వమే ఉంది. మనం ఉన్నాము గనుక అహంకారం ఉన్నట్లు తోస్తుంది. అహంకారాన్ని ఆత్మగా భావిస్తే, మనమూ అహంకారమే అవుతాం; మనస్సనుకుంటే మనస్సే, దేహమంటే దేహమే అవుతాం. ఇన్ని విధాల అరలను నిర్మించేది ఆలోచన. నీటిపై నీడ కదలాడుతుంది. దాన్ని కదలనీక ఎవరైనా ఆపగలరా? అది నిశ్చలమైతే, నీవు చూచేది నీరుగాదు, వెలుగు. అందువల్ల అహంకారాన్ని దాని వృత్తులనూ గమనించక దాని వెనుక నున్న దీప్తినే చూడు. “నేను” భావనే అహంకారం. యథార్థమైన 'నేను' ఆత్మయే.

భ: అట్లు చూడటం ఆత్మానుభవానికొక సోపానమా?

మ: ఆత్మ అనుభవము మునుపున్నదే. ఆలోచనలు లేని స్థితి, సహజమైన స్థితి. ఆత్మానుభవం అనేది వేరే ఒక కర్మ కాదు. ఆత్మ ననుభవింపనివాడే లేడు. తన ఉనికినే సంశయించే వాడు ఎవడైనా ఉంటాడా? అనుభవం అనుకుంటే,

అహములు రెండుండాలి. 1. అనుభవించేది, 2. అనుభవింపబడేది. ఇప్పటికి అనుభూతం కాని దాన్ని అనుభవింప ప్రయత్న మన్నమాట. మన మున్నామని ఒప్పుకుంటే, మన 'ఆత్మ' ఎందుకు తెలీదు?

భ: ఆలోచనల (మనస్సు) వల్ల.

మ: అవునలాగే, మధ్యలో నిలిచి, ఆనందాన్ని కప్పియుంచేది మనస్సే. ఉన్నామని మనకెట్లు తెలుస్తున్నది? మన చుట్టూరా జగత్తును చూస్తున్నాం గనుక అందామా, అంటే, నిద్రలో నీ ఉన్నావని ఎలా తెలుస్తుంది?

భ మనస్సును వదుల్చుకొనేదెలా?

మ: మనస్సు తానై కోరి తన్ను చంపుకొంటుందా? మనస్సు దానిని అప చంపుకోలేదు. కాబట్టి నీవు చేయతగ్గది దాని నిజస్వభావాన్ని గుర్తించడమే ఆ దశలో మనస్సు లేదని తెలియవస్తుంది. ఆత్మకై వెదుకుతుంటే మనస్సెక్కరా కనుపించదు. ఆత్మలో నిలబడితే మనస్సు విషయంగా ఏ ఆందోళనా అక్కరలేదు.

భ: భయం పోగొట్టుకోవడం ఎలా?

మ: భయమంటే ఏమి? అది కేవలం ఆలోచన. ఆత్మకు రెండవది ఉంటే భయ కారణం ఉంటుంది, ఆ రెండవ దానిని చూచెదెవరు? అది తనకు వెలిగా ఉందా? లేచిన అహంకారం విషయాలను వెలిగా చూస్తుంది. అహంకారం తల ఎత్తకపోతే, ఆత్మయే ఉంటుంది; రెండవది లేదు. తనకు వెలుపల ఏదైనా ఉందంటే, చూచేవాడు తనలోనివాడే కదా! వానిని కనుగొంటే సందేహాలు రావు భయం ఉండదు - భయమేగాదు, అహంకారాన్ని చుట్టుకొన్న ఆలోచనలన్నీ మటుమాయమౌతాయి.

భ: సాధన చతుష్టయం ముక్తి కత్యవసరమంటారు. వానికై శ్రమించేకన్నా మీ పద్ధతి సులువుగానూ సత్వరముగానూ ఉందే!

మ: అవును, అన్ని చెడుగుణాలు అహంకారం చుట్టూ తగులుకొని వున్నాయి. అహంకారం పోయెనా, ఆత్మ తానై సిద్ధిస్తుంది. ఆత్మలో మంచిచెడుగులు లేవు. ఆత్మకు ఏ గుణాలు లేవు. అది గుణాతీతము, ఏకముంటే ద్వితీయమూ ఉండాలి. అంకె ఒకటి, ఆపై సంఖ్యలకు తావీయదా? సత్యం ఒకటీ గాడు, రెండూ గాదు. అది అదే. ఉన్న విధంగానే ఉంది.

భ: ఆలోచనలు లేని స్థితిలో ఉండడమే కష్టము.

మ: ఆలోచనలే లేని స్థితిని, దాని నటుంచు. అది నిన్ననువర్తిస్తుందన్న మాట మరిచిపో, నడచేప్పుడు అడగులు అప్రయత్నంగా పడినట్లే, ఇతర పనుల విషయంలోనూ జరగనీ; కాని ఆ కర్మలేవీ నీ యోచనారాహిత్యాన్ని భంగపరచవు.

భః ఆచరణల్లో గుణదోష వివేకము చేసేది ఏది?

మ: గుణదోష వివేకము అప్రయత్నంగా, అవిచారితంగా లభిస్తుంది.

భ అంటే సహజ జ్ఞానం ముఖ్యం, అది ఎదుగుతుంది గదా?

మ: మూలసత్యములను కనుగొన్న మహాత్ములు నిశ్చలమైన ఆత్మ లోతుల్లోనుండి వానిని వెలుపలికి తీసారు.

అహంకారం, భూమిపై ప్రసరించిన మనిషి నీడ వంటిది. దానిని భూస్థాపితం చేసే యత్నం తెలివి లేనిపని. ఆత్మ యొక్కటే, అది పరిమితమైతే అది అహంకారం. పరిమితం కానప్పుడు అది అనంతము, సత్యమూనూ.

బుడగలు లెక్కలేనన్ని. అవి ఒకటి కొకటి వేరే. కాని సముద్రము ఒకటే. అట్లే అహంకారాలు (జీవాత్మలు) పెక్కులు. ఆత్మ ఒకే ఒక్కటి.

నీవు అహంకారం కావని తెలిసినప్పుడు, సత్యానుభూతిని పొందు. అహంకారమే నీవని తాదాత్మ్యము యెందుకు? "ఔషధము సేవించేటప్పుడు కోతిని స్మరించవద్ద"న్నాడట వైద్యుడు. అటుపై కోతిని మరువడం వానికి సాధ్యమేగాదు. ప్రజాసామాన్యం విషయంలోనూ అంతే. సత్యం ప్రకటితమైన పిదపగూడ, 'శివోహం', 'అహం బ్రహ్మాస్మి'యంటూ ఎందుకా జపం? సారం వివేచన చేసి గ్రహించాలి. వట్టి పదాలను వల్లెవేసిన మాత్రానికే, ఆలోచించిన మాత్రానికే ప్రయోజనం ఉంటుందా?

అహంకారం నాశనమే సత్యం. అహంకార నాశం జరిగేది ఎలా? దాని నిజాన్ని వెదకడం చేతనే. అహంకారం ఒక పదార్థం కాదు. మనం పెద్ద యత్నించకనే అది స్పష్టమై, సత్యం ప్రకాశితం అవుతుంది. ఇది ఋజువైన మార్గం. ఇతరాలన్నీ అహంకారమును విడువని సాములే. ఆ పద్ధతుల్లో తలయెత్తే ప్రశ్నలు కొల్లలు. అసలు సమస్య, చివరి దాకా పరిష్కారానికై వేచి ఉంటుంది. కాని ఈ మార్గాన ఆ ప్రశ్నతోనే మొదలు. ఈ అన్వేషణలో పాల్గోడానికి ఏ సాధనలూ అక్కరలేదు.

మనమే సత్యమైయుండి, సత్యానికై ఇంత ప్రయాసపడతామే, ఇంతకన్నా విడ్డూరముంటుందా? మన స్వభావాన్ని (సత్యాన్ని) ఏదో కప్పివేసిందనీ, దాన్ని నాశం చేస్తేనే ఆ సత్యం లభిస్తుందనీ భావిస్తాం. ఇది నలుగురూ నవ్వే విషయం. నీ వెర్రిశ్రమను తలచుకొని నీవే నవ్వుకొనే రోజు వస్తుంది. ఏ కారణంగా ఆ రోజు నీవు నవ్వగలవో, అది యిప్పుడే, యిక్కడే ఉంది.

భ: అయితే, జరుగుతున్నదంతా నటన మాత్రమేనా?

మ: అవును.

యోగవాసిష్టంలో ఉంది. "నిజమేదో మనకు కనబడక దాగియుంది. కాని నిజం కానిది నిజంవలె కనిపిస్తుంది." వాస్తవంగా మన మనుభవిస్తున్నది సత్యమే. కాని మనకది తెలియదు. ఇది వింతలకు వింత కదూ!' "నేనెవ"రన్న విచారము అహంకారానికి గొడ్డలిపెట్టు.

# భాషణములు 147

ఒక కన్నడ సన్న్యాసి వారి ప్రశ్నకు భగవాన్ బదులిట్లు ఇచ్చారు:

మహర్షి: మనస్సులో వివిధ అంతరాలు ఉన్నాయి. అనుభవించవలసింది పూర్ణతను. మనస్సుకది బోధపడదు. సర్వజ్ఞత్వము (అన్నీ తెలియడం) అంటే సర్వమూ (అన్నీ) అని అర్థం. 'అన్నీ' అంటే అది మనసుకు సంబంధించినది. అది తెలియుట, తెలియక పోవుటల కలయికే 'అన్నీ" మనస్సును దాటక ఆత్మగా నిలవగలవు. ఇపుడు నీకు తెలిసింది పరిమితము. పరిమితి లేనిది జ్ఞానము, పరిమిత జ్ఞానంలో పూర్ణజ్ఞానాన్ని గ్రహించటం సాధ్యంగాను, జ్ఞాతగా కూడ నిలువకు. అప్పుడు ఆ పూర్ణతను అనుభవిస్తావు.

# భాషణములు 148

ఒక గుజరాతి తాను నాదాన్ని ఉపాసిస్తున్నాననీ, అది సరియేనా అని అడిగాడు. మ: పెద్దలు చెప్పియున్న బహుమార్గాల్లో నాదోపాసన యొకటి. దాన్ని అనుసరించేవారు అది విశిష్ట మహిమ కలదని చెప్తారు. వారి దృష్టికది

సరళము, సులభము. జోలపాట బిడ్డలను నిదురపుచ్చేట్లు, నాదము సుప్రసన్నంగా సమాధి స్థితి చేరుస్తుంది. దూరం యాత్రచేసి తిరిగి వచ్చే రాకుమారునికి స్వాగతమీయడానికై రాజు వైణిక గాయకుల పంపి రావించునట్లు, నాదము కూడ భక్తుని పరమేశుని నివేశనానికి ప్రియంగా చేరుస్తుంది. నాదం చిత్తైకాగ్రతను పెంచుతుంది. అనుభవం తర్వాత కూడా సాధకుడికి అది పరమగమ్యం కాకూడదు. నాదం, ప్రాప్యం కాదు. కర్తను చాల గట్టిగా పట్టుకొని వదలరాదు. లేకపోతే ఫలితం ఒకరకమైన శూన్యత. ఆ శూన్యతలోనూ కర్త ఉన్నాడు. కాని సాధకుడు అచట వివిధాలైన నాదాల లయమును గమనించలేడు. ఆ శూన్యంలో సైతం, చేతస్సురణ ఉండవలెనంటే, వాడు తన్ను మరువరాదు. నాదోపాసన మంచిదే; దానికి విచారము జోడిస్తే మరీ మంచిది. అప్పుడది చిన్మయమూ (జ్ఞానమయము), తన్మయము (ఆత్మమయము) గూడా. నాదము చిత్తైకాగ్రతకు చాల సహాయకము.

# భాషణములు 149

ఒక సాధువు: భక్తి దేహాన్ని మరపిస్తుందా?

మ: దేహం గూర్చి నీ కెందుకాచింత? భక్తి నభ్యసించు. దేహమే మవుతుందని విచారించక.

# భాషణములు 150

అమెరికానుంచి వచ్చిన వృద్ధ దంపతులు కెల్లీ మరియు వారితో వచ్చిన వారు ఇలా అడిగారు:

“ఇట్లు కూర్చోవలసిన బాధ, ఈ దోమకాట్లు, ఇన్నిటి మధ్య చిత్తైకాగ్రత కుదరటాని కేంచేయాలి?"

మ: చిత్తం సరిగా ఏకాగ్రమైతే, ఈ చిన్న ఇబ్బందులు మిమ్మల్ని బాధించవు. ఇబ్బందిని లెక్కించకండి. మనస్సును ధ్యానమగ్నం చేయండి. దోమకాటు భరించేపాటి శక్తి, సహనమూ లేకుంటే, ఆత్మసిద్ధి నేమని ఆశిస్తారు. జీవితంలోని అన్ని ఒడుదుడుకుల మధ్యలోనే, మీ ఆత్మానుభవం కావలసియుంది. అన్నీ సుఖకరంగా చేసుకొని చక్కదిద్ది పడక చేరితే నిద్రిస్తారు. కష్టాలను ఎదుర్కోండి. కాని ధ్యానంలో సుస్థిరంగా నిలబడండి.

# భాషణములు 151

ఆ ఆమెరికన్కు కొద్దిగా సరిగా వినబడదు. చిన్నప్పటి నుండి తన స్వశక్తితో బయటకు రావడం వలన పెరగటం వల్ల, ఈపాటి చెవుడు కూడా వానిని కలతపెడుతున్నది.
మ: నీవు పెరిగింది ఆత్మ సహాయంగా కాదు. అహంకారం సహాయంగా ఆ అహంకారాన్ని అవలంబించుట మాని ఆత్మావలంబనం మొదలు పెట్టు బాగుంటుంది.

శ్రీభగవాన్ మరొక మాట అన్నారు:

“బాధపడవలసిన అవసరం లేదు. ఇంద్రియాల స్వాధీనంలోకి తెచ్చుకోటం ఆత్మసాధన సామాగ్రిలో మొదటిది. నీకై దైవమే ఒక ఇంద్రియాన్ని అణచేసాడు. అంతమటుకూ మంచిదే.

భ: శ్రీభగవాన్ హాస్యమయితే బాగుంది కాని, నా మటుకు నాకు, దీనివల్ల ఆత్మగౌరవం దెబ్బతింటున్నది.

మ: ఆత్మ ఒక్కటే. నీవు చేసే తప్పిదాలకు నిన్ను తిట్టుకుంటావు, అసహ్యించుకొంటావు. అదేమన్నా నిన్ను బాధిస్తుందా? ఆత్మను చిక్కబట్టుకో. నిన్ను పరిహసించే రెండోవాడుండడు. జగత్తును చూస్తున్నంత సేపు, ఆత్మ నీ చేయి జారిపోతుంది. అట్లుగాక ఆత్మనే పట్టుకో. ప్రపంచం కనబడదు,

# భాషణములు 152

శ్రీమతి కెల్లీ ధ్యానం బాగా చేయటమెట్లో తెలుపగోరింది. రోమన్ కాథలిక్కులవలె జపమాల త్రిప్పుతూ ధ్యానం చేశావా అని భగవాన్ అడగగా లేదని జవాబు చెప్పింది శ్రీమతి కెల్లీ.

మ: దైవాన్ని, ఆయన గుణాదులను గురించి ఆలోచించావా?

భ: ఆ విషయాలను చదివాను, ఉపన్యసించాను గూడ.

మ: ఆ విషయాలే వాచాకాకుండా మనస్సులోనే తిరగవేస్తే ధ్యానం అంటారు.

భ: 'గుప్తపంథా' (సీక్రెట్పాత్) మరియు 'నే నెవరు' పుస్తకాల్లో వివరించిన ధ్యానాన్ని నేను కోరుతున్నాను.

మ: భక్తిలో మనస్సు కరిగిపోయేట్టు, దానినే గాఢంగా కోరుకో. కర్పూరం వెలిగిన తర్వాత మిగులేమీ ఉండదు. మనస్సు ఆ కర్పూరం. అది తన వెనుక యే కొంచెమూ మిగల్చక, ఆత్మలో మరిగిపోతే, అదే ఆత్మసిద్ధి.

# భాషణములు 153

పెషావరునుంచి కొందరు వచ్చారు. న్యాయశాఖలో కమీషనర్ వారిలో ఒకరు. మరొకరు బాగా చదువుకున్నట్లు, చిత్తశుద్ధితో ఉన్నట్లు కనబడ్డారు.. జీవాత్మకు పరమాత్మ వేరేయని వాని గట్టి నమ్మకం. అతడడిగితే వాని సందేహాలన్నీ తీరుస్తూ క్లుప్తంగా శ్రీభగవాన్:

మ: ఆ ఉపాధులు 'జీవ', 'పరమ' అనీ విశేషణలు. 'ఆత్మ' నుండి ఆ విశేషణాలను తొలగించు; వానిలో భేదముందా? ఇంకా నీకు సందేహాలు ఉంటే, "ఈ సంశయించేదీ, యోచించేది ఎవరు?" అని నిన్ను నీవు ప్రశ్నించుకో; అతన్ని కనిపెట్టు; సంశయాలు అవే తొలగిపోతాయి.

# భాషణములు 154

మరుసటి రోజు అతడు ప్రాణాయామన్ని గూర్చి ప్రశ్నించాడు. జ్ఞానపద్ధతిలో

ప్రాణాయామము ఇది:

దేహం, న అహమ్, నేనిది కాను రేచకము (నిశ్వాసము)

కోహమ్, నేనెవరు, పూరకము (ఉచ్ఛ్వాసము)

సోహమ్, నేనది, కుంభకము (శ్వాసధారణము)

ఇది 'విచారము'. ఈ విచారమువల్ల కావలసిన ఫలితాలు వస్తాయి.

ఇందుకు పూనుకోతగ్గ పరిణతి లేనివారు, దేనినైనా ధ్యానిస్తూ శ్వాసను నియమించవచ్చు. అప్పుడు మనస్సు నిశ్చలం అవుతుంది. మనో నిరోధము స్వయంగానే శ్వాసను నిరోధిస్తుంది. ఫలితము కేవల కుంభకము (ఉచ్ఛ్వాస నిశ్వాస్వసములు లేక, అప్రయత్నంగా లభించే శ్వాసధారణము).

అట్టి ధ్యానమూ చేతగాకుంటే మనస్సును శాంతపరచుటకు శ్వాసను నియమించమన్నారు. శ్వాస వశంలో ఉన్నంతవరకే, మనస్సు నిశ్చలంగా ఉంటుంది. కాబట్టి అది నిలుకడలేనిది. ప్రాణాయామం గమ్యం కాదని స్పష్టమే. దానికింకా ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు చేర్చాలి. ఆ దశలన్నీ చిత్తనిరోధానికి సంబంధించినవి. పూర్వమే ప్రాణాయామం చేసియున్న వానికి చిత్తనిరోధములు సులువు. ప్రాణాయామము చిత్త నియమాత్మకాలైన పైపై దశలను అందిస్తుంది. అందుకనే చిత్తనిరోధము యోగానికి గూడ ఒక లక్ష్యము.

ఇంకా పరిణితి పొందిన వ్యక్తి శ్వాస నియమాదులతో కాలం వ్యర్థం చేయక, నేరుగా చిత్త నిరోధానికి పూనుకొంటాడు. కొద్దిగా వృద్ధిచేసుకుంటే, అందరూ వెంటపడే సిద్ధులను ప్రాణాయామమే ప్రసాదించగలదు.

ఆహార నియమం ఏదైనా ఉన్నదా అని అడగగా శ్రీభగవాన్ "మిత, హిత, భుక్" - హితమైన భోజనం కొద్దిపాటిగా చేయవలెనన్నారు. భక్తి ఎంతవరకు ఉపయోగపడుతుందని అడుగగా శ్రీభగవాన్ ఇలా చెప్పారు; విభక్తి యున్నంతవరకూ భక్తి కావలసే ఉంది. వియోగం కలంతకాలము యోగమూ ఆవశ్యకమే. ద్వంద్వమున్న వరకూ దైవమూ భక్తుడూ వేరే. విచార మార్గంలోకూడా దీనికి సాదృశ్యం ఉంది. విచారమున్నంత కాలం ద్వంద్వ ముండదా? కాని మూలంలో లీనమైతే ఉండేది ఏకమే. అట్లే భక్తిలోనూ, ఏ దైవమంటే భక్తియో, అతనిలో ఐక్యమైతే అప్పుడూ ఏకతే మిగులుతుంది. దైవచింతనగూడ ఆత్మలోనే, ఆత్మచేతనే. కాబట్టి దైవము ఆత్మ కభిన్నుడు. దైవమందు భక్తి ఉంచు అన్నప్పుడు తక్షణమే అట్లుచేస్తే సరి. మరోరకం వ్యక్తి ఉంటాడు. అతడు "మేమిద్దరం, నేనూ, దేవుడూ, ఎక్కడో ఉండే దేవుని తెలిసికొనే ముందు, నాకెంతో దగ్గర బాగా పరిచితమైన 'నన్ను' తెలిసికోవాలి కదా అంటాడు. అట్టివానికి విచారమార్గము చెప్పాలి. నిజంగా భక్తివిచారములకు భేదము లేదు.

# భాషణములు 155

భ: సమాధి స్వభావము, దాని సాధనావిధానాలేవి?

మ: సమాధి స్వభావాన్ని అందు ప్రవేశించే మార్గాన్ని అడుగుతున్నతడు మాయమైనప్పుడు సమాధి లభిస్తుంది.

మేజర్ చాడ్విక్: మహాత్ముల కృపాదృష్టి ఉంటేచాలు. విగ్రహ పూజలూ యాత్రాదులూ దాని సాటి రావంటారు. నేనిక్కడ మూడు నెలలుగా ఉన్నాను. మహర్షి కరుణాదృష్టి యేపాటి నాపై ప్రసరించిందో నాకింతవరకు తెలీదు.

మ: ఆ దృష్టి వ్యక్తిని శుద్ధుణ్ణి చేస్తుంది. ఈ శుద్ధి కంటికి తెలీదు. నేలబొగ్గు రాజుకోడానికి చాలసేపు పడుతుంది. మామూలు కర్రబొగ్గు త్వరలో మండుతుంది. కుప్పగా నున్న తుపాకి మందు తక్షణమే ప్రేలిపోతుంది. మహాత్ముల సంపర్కానికి వచ్చే వారిలో గూడ తరతమాలుంటాయి.

కోహెన్: ధ్యానించేప్పుడు ఒక దశకు చేరుకుంటాను. దాన్ని శాంతియనండి.

ధ్యానం చేసే భావం అనండి. ఆ తరువాతి మెట్టు ఏమి?

మ: శాంతి ఆత్మానుభవము, దాన్ని ఏవిధంగానూ చెదరనీగూడదు. ప్రతివ్యక్తి శాంతినే లక్ష్యంగా ఉంచుకోవాలి.

భ: కాని అది నాకు తృప్తికరంగా లేదే?

మ: నీ శాంతి తాత్కాలికము గనుక. అది శాశ్వతం చెయ్యగల్గితే అదే ఆత్మానుభవము.

# భాషణములు 156

భ: అభ్యాసానికి ఏకాంతం ఉపకరిస్తుందా?

మ: ఏకాంతమంటే?

భ: ఇతరులకు దూరంగా ఉండటం.

మ: ఎందుకు అలా చెయ్యాలి. భయమే అట్లు చేయించేది. ఏకాంతంలోనైనా ఎవరైనా చొచ్చుకొని వస్తారని ఏకాంతం భంగమౌతుందని భయం. ఏకాంతంలో ఆలోచనలను ఎలా ఆపడం? ఆ పని ఇప్పుడున్న చోటనే చెయ్యాలి కదా?

భ: ఇప్పుడు మనస్సు విక్షిప్తమై ఉంది.

మ: మనస్సును దానిపాటికి దాన్ని ఎందుకు వదిలావు? ఏకాంతం అంటే మనస్సును నిశ్చలంగా నిల్పటం. గుంపులో నున్నా ఇది సాధ్యమే. ఆలోచనలను తుడిచిపేయడానికి కావలసింది. ఏకాంతంగాదు, అభ్యాసం ఆ అభ్యాసాన్ని ఇక్కడా చేయవచ్చు.

# భాషణములు 157

భ: నేనెవరని విచారం చేస్తూండగా ఒక దశలో మనస్సును ప్రతికూలంగా నిలుపమన్నారు. అట్లైతేనే అనుగ్రహం ప్రవేశింపగలదట. ప్రాతికూల్యం అనుకూల ఫలాన్నెట్లిస్తుంది?

మ: ఆత్మ యెప్పుడూ ఉన్నదే - కొత్తగా పొందవలసింది గాదు.

భ: నే నడుగనెంచింది యిది - అనుగ్రహార్హతకు ఆ ప్రతికూల స్థితిలో ఏం చేయాలి?

మ: అనుగ్రహం లేకుండానే యిట్లు ప్రశ్నిస్తున్నావా? ఆది మధ్యాంతాల్లో అన్నిటా అనుగ్రహం ఉంది. అనుగ్రహం అంటే ఆత్మ. మిథ్యయైన దేహాత్మభావనలవల్ల గురువును శరీరిగా ఎన్నుతున్నాము. కాని గురువు దృష్టిలో ఆత్మయే గురువు. ఆత్మ యేకైకము. ఆత్మ ఒకటే యని గురువు తెలియచెబుతాడు. మరి గురువు నీ ఆత్మయే అయినప్పుడు అనుగ్రహం మరెక్కడనుంచి వస్తుంది? కేవలం ఆత్మనుండియే. ఆత్మ సాక్షాత్కారం, అనుగ్రహ సాక్షాత్కారమే, తప్పు దృష్టి కోణం వల్ల ఈ సందేహాలన్నీ కలిగి బాహ్యవస్తు విషయాలకై ఎదురు చూడటం సంభవిస్తున్నది. ఆత్మకు వెలిగా ఏమియు లేదు.

భ: మా ప్రశ్నలు మా దృక్పథంలో - భగవాన్ సమాధానాలు వారి దృక్పథంలో, మా ప్రశ్నలకు సదుత్తరాలు లభించడం సరేసరి. మా ప్రశ్నలు అర్థం లేవని తెలుస్తోంది.

# భాషణములు 158

ఫ్రిడ్మన్: జనకుడు జ్ఞాని; అయినా రాజ్యపాలనం సాగించాడు. కర్మ చెయ్యడానికి మనోవ్యాపారం అక్కర లేదా? జ్ఞాని మనోవ్యాపారములకేమైనా ప్రత్యేక ధర్మము కలదా?

మ: 'జు జ్ఞానియైనా కర్మలందు ప్రవర్తించాడని నీవంటున్నావు. జనకు డట్లేమైనా అనుకున్నాడా? ఆ ప్రశ్న నీ మనస్సుకు తోచింది. జ్ఞానికి ఆత్మ వినా వేరేమీ తెలియదు. ఎలాంటి సంశయాలూ కలగవు.

భ: బహుశః కర్మలో స్వప్నంలో వలెనేమో, మేము ప్రస్తావించే కలల వలెనే వారికి వారి కర్మలునూ.

మ: ఆ కలలూ అవీగూడ నీ మనస్సులోనివే. ఈ సమాధానమూ నీ మనస్సులోనిదే.

భ: నిజమే. ఇప్పుడు తెలుస్తున్నది. అంతా రమణమాయ - ఆత్మ కల్పించినది.

మ: అలా అయితే ద్వంద్వభావనా ఉండదు, ఈ మాటలూ ఉండవు.

భ: ఆత్మజ్ఞులయినవారు ప్రపంచానికెక్కువ ఉపకారం చేయగలరనుకుంటాను. అది అంతే కదా?

మ: కావచ్చు. ప్రపంచం ఆత్మకు భిన్నమైతే.

# భాషణములు 159

కోహెన్: ఆత్మానుభవానికి తన్మయత ఏకైక లక్షణమా?

మ: తన్మయావస్థలోను, గాఢనిద్రలోను, ఆత్మస్థితిలోనూ అన్నిటా సదా నీవు ఆత్మప్రతిష్ఠితుడవే. ఆత్మను గాదని మనోదేహాల్తో తాదాత్మ్యం భావిస్తే ఆ అవస్థలు నిన్ను మ్రింగవేసినట్లు, అవుతుంది. తన్మయత రిక్తతవలెగూడ అనిపిస్తుంది. కాని యథార్థానికి నీవు నిత్యమైన ఆత్మవే.

భ: శీర్షస్థమైన జ్యోతిని క్రిందికి హృదయంలోనికి రావించవలెనని అరవిందులన్నారు.

మ: హృదయంలో ఆత్మ అంతకు పూర్వమే లేదా? ఆత్మ సర్వాంతర్యామిగదా,

దాన్ని చోటుచోటుకూ తీసుకొని వెళ్ళేదెలా?

భ: కర్మయోగి, భక్తుడూ గూడ తన్మయావస్థను పొందుతారా?

మ: ఒకే స్థానమందు మనస్సును లగ్నం చేస్తే నీవు దానిలో మగ్నుడవౌతావు. ఈ మజ్జనమే తన్మయావస్థ ఇతరములన్నీ మరిగిపోయి ఆత్మయొకటే మిగులుతుంది. కర్మికీ భక్తునకు కూడ ఈ దశ తప్పదు.

# భాషణములు 160

భక్తుడు: హృదయమంటే యేమి? దానిలో స్ఫురణమేమి? అవి యే విధంగా తెలియవస్తాయి?

మహర్షి: హృదయమూ, స్ఫురణా, రెండూ ఆత్మకు సమానమే. స్ఫురణ వ్యక్తం కావడానికి ఆధారమొకటి కావాలి. దీన్ని విచార సంగ్రహము (ఆత్మ విచారం) అనే గ్రంథంలో వివరించేయున్నారు.

భః స్ఫురణ ఏ రూపంగా కన్పిస్తుంది. తేజంగానా, కదలికగానా, మరేదైన

విధంగానా?

మ: అది మాటల్లో వివరించే దెట్లా? నీవు చెప్పిన విధాలన్నీ దానికి వర్తిస్తాయి. అది ఆత్మ. దానిపై ధ్యానం నిలుపు. దాని పరమార్థాన్ని మరవకు.

# భాషణములు 161

అనంతపూరునుండి వయసు మళ్ళినవారొకరు హాలులో వేదపారాయణం అయ్యాక లేచి అడిగారు.

"బ్రాహ్మణేతరులు వేదపారాయణం వినరాదని అంటారు కదా?"

మ: నీ పని నువ్వు చూసుకో. నీ విక్కడికెందుకు వచ్చావో ఆ పని చూడు. ఈ విషయాల్లో కాలం ఎందుకు వృథా చేస్తావు? "నేను వేదపారాయణం విన్నానంటివే', ఆ 'నేను' ఎవరు? దాని కర్థం తెలియకుండా 'నే'నంటున్నావే. దాని తాత్పర్యం ఎరిగితే నీకే సందేహాలుండవు. 'నే' నెవరో ముందు తెలుసుకో, ఇతర విషయాలు ఆపై చర్చించవచ్చు.

భగవాన్ అలాగే సాగించారు – "స్మృతులేవేవో చెప్పాయి. అవన్నీ ఈ రోజులకు కనురూపం గావు. మేము ప్రపంచాన్ని మరమ్మత్తు చేస్తాం. స్మృతులను తిరగ వ్రాసేస్తామని ఆర్భాటాలూ, చిందులూ త్రొక్కినవారు ఎప్పుడూ వస్తూనే వున్నారు. ఆ సంస్కర్తలు వచ్చారు, వెళ్ళిపోయారు. కాని స్మృతులు స్థిరంగానే వున్నవి. వ్యర్థవాదాలతో కాలం పుచ్చక ఎవరి పని వారు చూచుకుంటే అన్నీ సరిగనే ఉంటాయి."

# భాషణములు 162

ఒక మహారాష్ట్ర యువతి నడివయస్సులో ఉంది. 'జ్ఞానేశ్వరి' 'భాగవతం' 'విచార సాగరం' చదివియుంది. భ్రూమధ్యంలో దృష్టి నిలిపి అభ్యాసం సాగిస్తుండగా, ఆమెకు కంపనం, భయం కలిగింది. ఆపై అభ్యాసం సాగలేదు. ఏమి చేయాలో చెప్పండని వేడుకుంది.

భగవాన్ ఆమెతో చూచే దెవరో మరవవద్దన్నారు. భ్రూమధ్యంలో దృష్టిని నిల్పావు. కాని ద్రష్టను నీ దృష్టిలో పెట్టుకోలేదు. ఆ ద్రష్టను సదా జ్ఞప్తి పెట్టుకొంటే అంతా సరియౌతుంది.

# భాషణములు 163

70 ఏండ్ల అమెరికన్ డా. హెన్రీ హాండ్ అడిగారు. అహంకారమంటేయేమి?

మ: అది ఎక్కడో వెలుపలిది గాదు, నీలోనిదే. నీకు బాగా పరిచితమై ఉండాలికదా.

భ: దాని నిర్వచనం యేమి?

మ: ఆ నిర్వచనమూ అహంకారంనుండే రావాలి. అహంకారం తన్ను తానే నిర్వచించుకోవాలి.

భ: ఆత్మయంటేనో?

మ: అహంకారాన్ని కనుగొంటే ఆత్మ గోచరిస్తుంది.

భ: అయితే ఆత్మ అహంకారం రెండూ ఒకటేనా?

మ: అహంకారం లేకుండా ఆత్మ ఉండగలదు. కాని ఆత్మలేకపోతే అహంకారం నిలువదు. అవి సముద్రమూ, బుడగ వంటివి.

భ: ఇప్పుడు కొంత తెలుస్తున్నది, ఆత్మయంటే ఏమి?

మ: ఆత్మా జీవుడూ ఒకటే.

# భాషణములు 164

మరో ఆమెరికన్ వివిధ ఆలోచనల రూపాలను గూర్చి ప్రశ్నించాడు.

మ: ఆలోచనల మూలం కనుక్కో, ఆపై అవి కనబడవు.

భ: ఆలోచనలు వాస్తవాలు కావచ్చు (మెటీరియలైజ్)

మః ఆలోచనలుంటే అవి వాస్తవాలు కావచ్చు. అవి అదృశ్యమైతే వస్తుత్వం దేనికి? నీవు పాంచభౌతికం అయితే, ప్రపంచమూ అంతే. నీవు పాంచభౌతికమేమో కనుక్కో.

భ: ఈశ్వర సృష్టికి నేనేమైనా ఉపకరిస్తానా?

మః సృష్టిలోని ఈశ్వరాంశకు నీ 'ఆత్మ' భిన్నమేమో చూడు. నీకు నీవు. సాయపడలేవు. ప్రపంచానికి సాయపడతానంటావు. కాని దానికై నీకా ఈశ్వరాంశే సాయం చెయ్యాలి. నిన్ను శాసిస్తున్నదీ, నడుపుతున్నదీ ఈశ్వారాంశే, నిద్రలో నీవెక్కడికి పోయావు? ఎక్కడినుండి మరలి వస్తున్నావు?

భ: నేనూ నా ఆలోచనలవలన, పనులవలన ప్రభావితుడ్ని అవుతున్నాను.

వ: ఆలోచనలు, పనులు ఒకటే.

భ: భౌతిక అతీత విషయాలను, అంటే ఉదాహరణకు మనలను పరిరక్షించే శక్తులను ఇంద్రియాల ద్వారా తెలిసికొనే మార్గము ఏమైనా ఉందా?

మ: కనబడే విషయం, చూచేవాని స్థితి కనుగుణంగానే ఉంటుంది.

భ: పలువురు చూచింది ఒక్కటే అయితే?

మ: అందరిలోనూ ద్రష్ట సముడే. వ్యక్తులనేకులు గావచ్చు. నానాత్వము నిద్రలో కనిపిస్తుందా?

భ: ఎన్నడో మరణించిన అబ్రహాం లింకన్ను మేము చూస్తున్నాము.

మ: చూచేవాడులేక విషయముంటుందా? అనుభవం నిజంగానే ఉండవచ్చు. కాని విషయం చూచేవాని చూపుని బట్టే ఉంటుంది.

భ: నాయొద్ద పనిచేస్తున్నతడు యుద్ధంలో చనిపోయాడు. ఆ తర్వాత కొన్నాళ్ళకు మావాళ్ళు పలువురు చేరి ఫోటో తీసుకున్నారు. ఆ ఫోటోలో వాని చిత్రమున్నది. అది ఎలా సంభవించింది?

మ: బహుశ: ఆలోచనలకు రూపు వచ్చిందేమో? ఆ విషయం మూలమేదో విచారించు.

భ : ఎలా?

మ: దారి నీకు వెలుపల ఉంటే, 'ఇటు,' 'అటు' అని దాన్ని సూచించవచ్చు. కాని ఇచట దారి నీలోనే ఉన్నది. లోననే దానికై వెదకాలి. ఆత్మయెప్పుడూ అనుభూతమే. అనుభవం కాని విషయమైతే దానికై క్రొత్తగా యత్నించాలి. కాని ఆత్మ నీ అనుభవంలోనిదే.

భ: సరే. నేను నా ఆత్మను పొందుతాను.

మ: 'నేను' నా 'ఆత్మ' - అవి రెండా?

భ: నా ఉద్దేశం అది కాదు.

మ: అనుభూతం చేసికోనిది కాని, చేసుకొనేది కాని ఎవరు?

భ: అది ఒక్కటే, 'ఆత్మ'.

మ: ప్రశ్న ఆత్మలు రెండు ఉంటేనే వస్తుంది. ఆత్మను అనాత్మతో చేసే తప్పు

తాదాత్మ్యాన్ని వదులు.

భ: నేనడిగేది చేతనలో ఉన్నత దశ గురించి.

మ: దానిలో దశలు లేవు.

భ: మానవునికి జ్ఞానం ఒకే మారు ఏల కలుగకూడదు?

మ: మానవుడే ఆ తేజస్సు గనుక. అతడే యితరాలను వెలిగింప చేస్తాడు.

భ: మీరు బోధించేది ఇతరుల బోధలకన్నా భిన్నమా?

మ: మార్గం ఒకటే. జ్ఞాన అనుభూతి కూడా ఒక్కటే.

భ: మార్గాలు చాలా ఉన్నాయని అంటారే.

మ: వారివారి మనస్థితిని బట్టి అలా అంటారు.

భ: యోగం అంటే యేమిటి?

మ: వియోగం ఉంటేనే యోగం (కలయిక). కాని ఉన్నదే ఒకటి. నీ వాత్మనెరిగితే ఏ భేదభావమూ ఉండదు.

భ: గంగా స్నానం వల్ల ప్రయోజనం ఉందా?

వ: గంగ నీలోనే ఉంది. ఈ గంగ నిన్ను చలిలో వణకించదు. దానిలో మునుగు.

భ: భగవద్గీతను అప్పుడప్పుడు చదవాలా?

మ: ఎప్పుడూ చదవాలి.

భ: బైబిల్ చదువ వచ్చునా?

మ: ఆ రెండూ వేరు కావు.

భ: మానవుడు పాపమునుండి పుట్టినవాడు అంటుంది బైబిల్.

మ: పాపమే మనిషి, నిద్రలో మనుష్యత్వము లేదు. పాపమన్న ఆలోచనలకు మూలము దేహభావన. అసలు ఆలోచనల పుట్టుకే పాపము.

మరొక ప్రశ్నకు భగవాన్ జవాబు: "ప్రతివాడూ ఆత్మనే చూస్తాడు. దేవతాకృతులు సత్యసముద్రంలోని బుడగలు. సినీ తెరపై కదలాడే చిత్రాల వంటివి.

భ: బైబిల్ లో ఆత్మ నష్టమౌతుందన్నారే.

మ: అహమన్న ఆలోచనే అహంకారం. నష్టమయ్యేది అది. నిజమైన 'నేను' బైబిల్లోని 'నేనదే నేను' (అయామ్ దట్ అయామ్)

భ: అరవిందుల బోధలకూ, అచటి 'మాత' బోధలకూ తేడా అనిపిస్తుంది..

మ: మొదట శరణాగతి చేయి. ఆ బేధాల సమన్వయం ఆపైన చూసుకోవచ్చు.

భ: సన్న్యాసమంటే ఏమిటి?

మ: అహంకార త్యాగము.

భ: ఆస్తిపాస్తులను వదులుకోవడం కాదా?

మ: వాటినన్నిటిని పట్టుకొన్నవాడిని కూడా వదులుకోవాలి.

భ: ప్రజలు తమ ధనాదులను పరులకై త్యాగంచేస్తే ప్రపంచంయెంతో చక్కబడుతుంది.

మ: మొదట నిన్ను నీవర్పించుకో. మిగతా విషయాలు, తర్వాత ఆలోచించవచ్చు. ఇంకో ప్రశ్నకు బదులుగా శ్రీభగవాన్.

మనస్తత్వం భేదాన్ని బట్టి ఒక్కొక్క విధానం అనువుగా తోస్తుంది. పూర్వం అతడు చేసిన అభ్యాసం గూడ, ఆ విధాన నిర్ణయంలో తోడ్పడుతుంది.

భ: ఆత్మానుభవం హఠాత్సంభవం కాకూడదా?

మ: ఆత్మానుభవం క్రొత్తది కాదు. అది నిత్యము. అనుభవం తక్షణమా, క్రమంగానా అన్నమాటే లేదు.

భ: పునర్జన్మలు ఉన్నాయా?

మ: ఇపుడు జన్మించి ఉంటే, మరొక జన్మం మాట. ఇప్పుడు కూడా నీవు జన్మించలేదు.

మరో ప్రశ్నకు భగవాన్ ఉత్తరము

అన్ని రోగాలకూ మూలం అహంకారం. దాన్ని త్యజించు. అటుపైన ఏ రోగమూ ఉండదు.

భః అందరూ సన్యసిస్తే ప్రపంచం సాగేదెలాగ? దున్నేదెవరు? పండించేదెవరు?

మ: మొదట ఆత్మ సిద్ధించనీ. ఆపైన ఆలోచిద్దువుగాని, వాఙ్మన: క్రియలకన్నా ఆత్మానుభవ మిచ్చే సహాయమెన్నో రెట్లెక్కువ. నీ యథార్థ్యం నీ వెరిగితే, ఋషుల గురువుల యాథార్థ్యం బోధపడుతుంది. నిజమైన గురువొక్కరే, అదే ఆత్మ.

భ: గురువులు మౌనానికి, శ్రద్ధగా వినడానికి ఎందుకు ప్రాముఖ్యత ఇస్తారు.

మ: మౌనమంటే ఆగని వాక్పటిమ.

భ: శ్రద్ధగా వినే మనోదృక్పథం అంటే ఏమిటి?

మ: మనోవిక్షేపం లేకుండా ఉండడం.

భ: అమెరికన్ భారతీయ విద్వాంసులను, ఇచ్చి పుచ్చుకోవడంగా సన్నిహితులను చేస్తే లాభముంటుందా?

మ: అట్టివి వానియంతట అవే జరిగేవి. దేశాల భాగ ధేయాలను విధించే శక్తి యొకటున్నది. సత్యానికి దూరమైతేనే ఇట్టి ప్రశ్నలు. నీవు అమెరికాకుగాని, ఇండియాకుగాని భిన్నంగా ఉన్నావా? మొదట అది గుర్తించి చూడు.

భ: శ్రీరామకృష్ణులు వివేకానందుని తీర్చిదిద్దారు. దాని వెనకనున్న శక్తి ఏమిటి?

మ: అందరిలోని శక్తి ఒకటే.

భ: ఆ శక్తి స్వభావమేమి?

మ: ఆ శక్తి అయస్కాంతం లాంటిది. అది నీలో వున్నది, వెలుపల గాదు. రామకృష్ణులు వివేకానందునిలో ఉండిరి. వివేకానందుని దేహమాత్రమనుకుంటే రామకృష్ణులూ దేహమాత్రులే కాని వారు దేహమాత్రులు గారు. రామకృష్ణులే వాని లోపల లేకుంటే, వివేకానందులు సమాధి పొందలేకపోయేవారు.

భ: తేలు కాటువేస్తే బాధ యెందుకు కలుగుతుంది?

మ: దేహమూ జగత్తూ యివి కనిపించడానికి కారణమేమి?

భ: అవి విశ్వచేతనలోని అంశాలు. (సమష్టి మనస్సులో భాగం)

మ: ఆ విశ్వచైతన్యమును (సమష్టి మనస్సును) నీవు చెప్పిన సంఘటనకు బోధపడనీ. వ్యక్తికి తెలుసుకోవాలని అనుకుంటే ఆత్మను కనుగొననీ.

భ: నైట్రిక్ ఏసిడ్ త్రాగటం, విషం మ్రింగడం, నిప్పులపై నడక ... ఇలాంటి యోగమహిమలు ఏదైనా శక్తి స్పందనవల్ల కలిగేవా?

మ: ఆ మాటను స్థూల దేహం అడగనీ. నీవా దేహం కావు. నీవు కాని దాని గురించి చింత నీకెందుకు? ఆత్మకు రూపేదైనా ఉంటే, విషయాలు దాన్ని బాధించవచ్చు. కాని ఆత్మకు రూపేలేదు. దానికి విషయ సంసర్గమూ లేదు.

భ: 'కరుణాబ్ధి' యొక్క పరమార్థమేమి?

మ: 'భూతాత్మ', 'పూతాత్మ' 'ఆత్మస్థితి' 'కరుణ' - ఇవన్నీ సమానార్థకాలే భ: మీతో జరిగిన ఈ సంవాదము చాలా స్పష్టతను కల్గించింది.

ఎన్. సుబ్బారావు: విశిష్టాద్వైత మేమిటి?

మ: ఇంతవరకూ చెప్పేదే.

భ: వారు మాయ సంగీకరించరు గదా?

మ: మనం సర్వమూ బ్రహ్మమంటాము. వాళ్ళు బ్రహ్మము సర్వంలోనూ సగుణుడు అంటారు.

భ: వాళ్ళు జగత్తును సత్యమంటారు గదా?

మ: మనమనేదీ అదే. శ్రీ ఆచార్యులవారు 'జగత్తు మూలమేదో చూడ'మన్నారు. అంతే. ఒకరు 'మాయ'యంటే, దాన్నే మరొకరు 'మార్పు' అంటారు. ఇద్దరి గమ్యమూ ఒకటే.

డా: హ్యాండ్: మహర్షీ! మేము చెడ్డపిల్లలమనుకోకండి.

మ: ఆ మాట నాకెందుకు చెప్పడం? చెడ్డ పిల్లలమని మీరనుకోకుంటే సరి. సాయంత్రం 5 గంటలయింది. అందరూ నవ్వుకుంటూ లేచి వెళ్ళారు. ఒక నిమిషం తర్వాత మహర్షి అన్నారు -వీళ్ళు మరొక రోజు గనుక ఇక్కడ ఉంటే మౌనం అయిపోతారు.

# భాషణములు 165

శ్రీ సుబ్బారావు: వ్యక్తులు సమాధిలో ప్రవేశించలేరా?

మ: సమాధి ఇప్పుడు లేదా?

భ: అది నిత్యమా?

మ: కాకపోతే అది సత్యమెట్లవుతుంది?

భ: ఆ పిమ్మట?

మ: పిమ్మటా లేదు, ఇప్పుడూ లేదు.

భ: అలాగే తోస్తున్నది.

మ: ఎవరికి?

భ: మనస్సుకు.

మ: మనస్సంటే నేమి? 'నే'నెవరు?

జవాబు లేదు.

# భాషణములు 166

భ: దివ్యశక్తిని లోపలికి గ్రహించి జరారోగాలను రాకుండా చేయవచ్చా?

మ: దేహాన్నే వర్ణించవచ్చు.

భ: ఆ శక్తిని లోనికెట్లు గ్రహించటం?

మ: అది యిప్పటికే అక్కడ ఉంది. క్రొత్తగా నింపనక్కరలేదు. నీకది వెలుపలగా ఉంటే లోనికి పుచ్చుకోవచ్చు. కాని ఆ శక్తి నీలోనే, లోపలికి పుచ్చుకోవడమూ లేదు. మరొకరికివ్వడమూ లేదు.

భ: ప్రకృతి నియమాలకు (నియతాహారంలాంటివానికి) కట్టుబడి యుండుట అవసరమా?

మ: అవన్నీ ఊహలలో మాత్రమే.

# భాషణములు 167

చిత్తైకాగ్రత అలవడలేదని ఒక వ్యక్తి బాధను వ్యక్తం చేసె.

మ: అది ఇప్పుడూ ఏకమే గదా; అది ఎప్పుడూ ఏకమే. నానాత్వము నీ ఊహలోనిదే. ఏకాత్మను సాధింప నక్కరేలేదు.

# భాషణములు 168

ఆత్మజ్ఞునికి అన్నాదులు అక్కరలేదు అన్నారు. అది మహర్షికి తెలిసి వారన్నారు "ఎవని మనో అవస్థనుబట్టి వాని అవగాహన గూడా".

# భాషణములు 169

భ: మనస్సును వశం చేసుకొనె దెలాగ?

మహర్షి: ముందుగా దాన్ని పట్టుకో.

భ: ఎలా?

మ: మనస్సంటే యేమి? తెలుసుకో. అది ఆలోచనల సమూహం.

భ: కామం సమూలంగా నాశం చేసేదెట్లు?

మ: మిథ్యయైన దేహాత్మభావనను వ్రేళ్ళతో పెల్లగిస్తే, ఆత్మలో లింగభేదము లేదు.

భ: దాన్ని సాధించేదెట్లు?

మ: నిన్ను నీవు దేహమనుకొంటావు అందుకే అన్యునీ దేహంగానే చూస్తాను. అప్పుడు లింగభేదం తోస్తుంది. కాని నీవు దేహం కావు. నిజమైన 'ఆత్మగా ఉండు. అప్పుడు లింగభావనే ఉండదు.

# భాషణములు 170

భ: యోగికి తన పూర్వజన్మలు తెలుస్తాయా?

మ: ఇప్పటి జీవితం పూర్తిగా తెలుసుకొన్నావా? గత జన్మ తెలిసికోవాలి. అనుకోడానికి. ఇప్పటి నీ జీవితం తెలుసుకో. మిగతావి వాటంతటవే జరుగుతాయి. తెలివితేటలు పరిమితంగా వుంటేనే యింత బాధపడుతున్నారు. ఇంకా ఎక్కువ తెలుసుకొని, భారం మరింత పెంచుకొని, దుఃఖం ఎంతో పెంచుకోవడం ఎందుకు?

భ: ఉపవాసం ఆత్మానుభవానికి ఉపయోగమా?

మ: తాత్కాలికంగా, సరియైనది మానసిక ఉపవాసం. ఉపవాసం గమ్యంకాదు. దానితోపాటుగా ఆధ్యాత్మికాభివృద్ధి గూడ కలుగుతుండాలి. పూర్తి ఉపవాసం వల్ల మనస్సు దుర్బలమవుతుంది. ఆధ్యాత్మికాన్వేషణకు వలసిన శక్తియుండదు. కాబట్టి ఆహారం మితంగా తీసుకుంటూ అభ్యాసం సాగించాలి.

భ: ఒక మాసం ఉపవాసముండి ఆహారం పుచ్చుకొన్నాక పది రోజులకు

మనస్సు శుద్ధమూ స్థిరమూ అయి అలాగే ఉండి పోతుందంటారు. మ: నిజమే, ఆ ఉపవాసకాలంలో కూడా అభ్యాసాన్ని చక్కగా సాగిస్తూ ఉంటేనే.

# భాషణములు 171

మ: ఉపన్యాసాలన్నిటికన్నా హృదయాలు రెండు పరస్పరం సరళంగా మాటాడుకోవడం, వినడమూ మేలు. అంతకు మించిన ఉపదేశమే లేదు.

భ: గురూపదేశం అవసరం కాదా?

మ: గురువు నుండి నీవు భిన్నంగా ఉన్నావా?

భ: గురు సామీప్యము ఉపయోగపడుతుందా?

మ: శారీరకంగానా? దానివల్ల లాభమేమి? ముఖ్యము మనస్సు, పెంపొందింపవలసింది మనస్సుతోడి సంపర్కము.

# భాషణములు 172

భ: ధ్యానానికి విచారమునకు భేదమేమి?

మ: రెండూ సమప్రయోజనాలే, విచార మార్గానికి స్తోమత లేనివారు ధ్యానానికి పూనుకోవాలి. ఇది జరుగుతుండగా, అభ్యాసి తన్నుతాను మరచి, 'నేను శివుడ'ననో, 'నేను బ్రహ్మ'మననో ధ్యానం సాగిస్తాడు. దీని తుది ఘట్టంలో శివుడో, బ్రహ్మమో మిగులుతాడు. అంత తానే శుద్ధసత్ అంటే ఆత్మయన్న అనుభవం కల్గుతుంది.

విచార మార్గంలో నడచేవాడు తానే 'నే నెవరు'తో మొదలుపెట్టి ముందుకుపోతే "ఆత్మ' అతనికి సువ్యక్తమౌతుంది.

భ: ఆత్మజ్ఞానము సిద్ధించిన తర్వాత మరల ఆ జ్ఞానం పోవడం జరుగుతుందా?

మ: కైవల్య నవనీతంలో అట్టి నష్టం సంభవమే అని ఉంది, వాసనలు నిశ్శేషం కాకుండా ప్రాప్తించిన జ్ఞానం స్థిరంగా ఉండదు. వాసనలను పూర్తిగా నశింప చేయడానికి ప్రయత్నం చేయాలి. లేకుంటే మరల జనింపక తప్పదు. గురుబోధ విన్నంతనే ఆత్మసాక్షాత్కారం కల్గునని కొందురు; ఇతరులు మననం అవసరమంటారు; చిత్తైకాగ్రతవల్లనే అని మరికొందరు; ఇంక కొందరు సమాధి మూలంగానని. ఇవన్నీ పైకి వేర్వేరుగా కనపడినా, నిజానికి అవన్నీ సమానార్థములే.

వాసనాక్షయం పూర్ణంగా అయితేనే జ్ఞానం సుస్థిరమవుతుంది.

# భాషణములు 173

భ: ప్రభో! అహంకారం పిడికిలి సడలించేదెట్ల?

మ: దానికి క్రొత్తగా వాసనలను కలపకపోతే సరి.

భ: జపమెంతో చేసాను. కాని అహంకారం దాని పట్టు సడలించడం లేదు.

మ: అట్లనుకోవడమెందుకు? అదే క్రమంగా సడలి, మటుమాయమౌతుంది.

# భాషణములు 174

డా.హాండ్: అహంకార మూలాన్ని కనుగొనేందుకు రెండు ఉపాయాలున్నారు?. మహర్షి: మూలములు రెండులేవు, ఉపాయాలు రెండు కావు. ఒకే మూలము, ఒకే విధానము.

భ: ధ్యానానికి ఆత్మవిచారానికి భేదమేమి?

మ: అహంకారాన్ని నిల్పియుంటేనే ధ్యానం సాధ్యం. అహంకారం ఉంది. ధ్యేయమున్నది. ఇది చుట్టుదారి. అహంకారాన్ని వెదకుతూ దాని మూలం చేరేసరికి అది అదృశ్యమౌతుంది. మిగిలేది ఆత్మ. ఇది సూటియైన మార్గం.

భ: అయితే నేనేది చేసేది?

మ: ఆత్మనే పట్టుకో.

భ: ఎలా?

మ: నీవెప్పుడూ ఆత్మవే. కాని నీవీ చైతన్యాన్ని (అంటే అహంకారాన్ని) శుద్ధచైతన్యమని పొరబడుచున్నావు. ఈ భ్రమ అజ్ఞానం వల్ల. అహంకారం మాయమైతే వెంటనే అజ్ఞానమూ మాయమవుతుంది. చేయతగ్గది అహంకార నాశనం. ఆత్మ అక్కడ సిద్ధమే, దాన్ని పొందడానికే ప్రయత్నం అక్కరలేదు. అది మనకు బాహ్యమూ కాదు, క్రొత్తా కాదు. అది సదా ఉంది, ఎల్లెడలా ఉంది. ఇప్పుడూ యిచ్చటే ఉంది.

# భాషణములు 175

శ్రీ ఎన్. సుబ్బారావు: భగవత్సాక్షాత్కారానికి - విశిష్టాద్వైతులు ఆత్మ సాక్షాత్కారాన్ని, పరమాత్మ సాక్షాత్కారానికీ పూర్వాంగమంటారు. ఇది అర్థం చేసుకోవడం చాలా కష్టంగా ఉంది.

మ: ఆత్మసాక్షాత్కారమంటే ఏమి? ఒకటి మరొకటిని తెలియడానికి ఆత్మలు రెండున్నాయా? లేవే? మొదట ఆత్మసాక్షాత్కారంకానీ, తర్వాత జరిగేదేమో అప్పుడు నిశ్చయించవచ్చు.

భ: జీవాత్మల మొత్తం భగవంతుని శరీరమని భగవద్గీత అంటోంది కదా?

మ: అహంకారం నాశం కావాలి. అంతవరకూ అందరొప్పుకొన్నదే. అక్కడినుంచే విచారిద్దాము. కొందరు అద్వైతులు కూడా నానా జీవత్వము (వివిధ వ్యక్తిత్వము)లను అంగీకరించారు. కాని ఈ చర్చలన్నీ ఆధ్యాత్మికోన్నతికి అవసరం లేదు. ఆత్మసాక్షాత్కారం మొదటపొందు, ఆపైన ఏమో అప్పుడు చూచుకోవచ్చును.

# భాషణములు 176

డా. హాండ్: మర్నాడు బయలుదేరి హరిద్వార్ వెళ్ళి రావలెననుకొన్నాడు. ఆ తరువాత యిక్కడినుంచి బొంబాయి, ఈజిప్టు, పాలస్తీనా యూరోప్లు చూచుకొని, చివరికి తన దేశం అమెరికా చేరవలెనని ఆయన ప్లాను.

అరుణగిరి శిఖరం ఎక్కవలెనని, భగవాన్ తనతో రావలెనని ఆయన ఆశ; ఆఖరుకు శ్రీభగవాన్ న్ను అడగనూ అడిగాడు. కొండ మీద మీరు ఓపినంతవరకూ వచ్చి నిలవ్వచ్చు; ఆపైన తా నొంటిగనే వెళ్ళి వస్తాను, అనుకొన్నచోట ఇర్వురూ కలిసికొని క్రిందికి రావచ్చునన్నాడు. భగవాన్ చిరునవ్వు నవ్వి, డాక్టర్ బీసీ అనుభవాలు విన్నావా అని ప్రశ్నించారు.

డా. హాండ్: బీసీ నా మిత్రుడే. అంతా పూసగ్రుచ్చినట్లు తెలిపాడు. నా కాశ్చర్యం అయింది. మహర్షీ! నేను మీ కన్న ముసలివాణ్ణి. అంత మాత్రానికి పనికిరానని త్రోసిపెయ్యకండి. కుర్రవానివలె కొండ నెక్కేస్తాను. మీరు శిఖరం ఎక్కిఎన్నాళ్ళైంది?

మహర్షి: పదకొండేండ్లు అయ్యుంటాయి. డాక్టర్ బిస్లీ ఏమి చెప్పాడు?

భ: అది పరమ రహస్యం. మీరొంటిగా నున్నపుడు చెప్తాను. మహర్షి నవ్వి ఊరుకున్నారు.

భ: మహర్షీ! అదృశ్యులుగా నున్న ఋషుల సంఘం ఉన్నదట తమకు అది తెలుసా?

మ: కనబడని వారిని చూసేదెలా?

భ: జ్ఞానేత్రంతో (జ్ఞానములో)

మ: జ్ఞానానికి బయట ఏమీ లేదు.

భ: వ్యక్తిత్వం ఉండదా? వ్యక్తిత్వాన్ని వదులుకోవడం నా కిష్టం లేదు. జ్ఞానంలో వ్యక్తి అస్తిత్వ జ్ఞానమూ లేదా?

మ: వ్యక్తిత్వం పోతుందనే భయమెందుకు? నిద్రలోని నీ స్థితి యేమి? అప్పుడు నీ వ్యక్తిత్వం నీకు తెలుసా?

భ: అది సాధ్యమా?

మ: నీ అనుభవం మాటేమి? అప్పుడు వ్యక్తిత్వ స్ఫురణ ఉంటే అది గాఢనిద్ర అవుతుందా?

భ: అది వివరణము మీద ఆధారపడి ఉంటుంది. మహర్షి ఏమంటారు?

మ: నీ అనుభవాన్ని మహర్షి చెప్పటం ఎట్లా? ఆయన బలవంతంగా మీచేత ఏదీ మ్రింగించరు.

భ: అది నాకు తెలుసు. కాబట్టే, మహర్షియంటే, వారి ఉపదేశాలంటే నాకంత

ఇష్టం.

మ: నీవు ప్రక్కపరచుకొని, చక్కగా సవరించి, గాఢంగా నిద్రించాలని ఉత్సహిస్తావే, అది నీ వ్యక్తిత్వాన్ని మరవడానికి కాదా? దానికి భయమెందుకు?

భ: బుద్ధుని నిర్వాణమంటే ఏమి?

మ: వ్యక్తిత్వ నష్టము.

భ: ఆ నష్టమంటేనే నాకు భయం. నిర్వాణంతో వ్యక్తిస్ఫురణ ఉండదా?

మ: అంటే రెండు ఆత్మలు ఉన్నాయా? నీ నిద్రానుభవం బట్టే చెప్పు.

భ: నిద్రలో వ్యక్తిత్వ స్ఫురణ నిల్పుకోవచ్చునని నాకు తోస్తున్నది. అది పోతుందంటేనే నాకు భయం.

ఆ మధ్యాహ్నం 12 గంటలు మొదలు సాయంత్రం 8 గంటలదాకా డాక్టర్ హాండ్ కొండపైన, కొండచుట్టూ (సుమారు 15 మైళ్ళు) తిరుగుతూ గడిపాడు. చివరకు అలసి, తిరిగివచ్చి వ్యవసాయం, సంఘజీవనము, వర్ణాశ్రమ విధానం, భారతీయుల తాత్త్వికతల గూర్చి విశదంగా ఉపన్యసించాడు.

# భాషణములు 177

భ: 'మహత్' అంటే ఏమిటి?

మ: శుద్ధచైతన్యం ప్రసరింపచేసిన కాంతి. విత్తనం ముందుగా ఉబ్బి తరువాత మొలకెత్తి పెరిగేట్లు శుద్ధ చైతన్యం కాంతిని ప్రసరింపచేసి ఆ పైన అహంకారం రూపొంది దేహంగా ప్రపంచంగా వృద్ధి చెందుతుంది.

చిత్ = కేవలము; బ్రహ్మము

మహత్ = ప్రసరించిన చైతన్యము (ఉబ్బిన విత్తనము)

అహంకారము = జీవాత్మ

మనస్సు = మనస్సు
అహం, ఇదం = దేహం, ప్రపంచము

మేజర్ చాడ్విక్: విశ్వచైతన్య మదేనా (కాస్మిక్ కాన్షియస్ నెస్)?

మ: అవును. జీవుడు, జగత్తులు పుట్టుకకు పూర్వస్థితి అది. అవన్నీ దాని అంతర్భాగాలే. ఒకే స్థానం నుండి ప్రసారితమైన కాంతివల్ల సినీ తెరపై చిత్రాలన్నీ కనుపించే రీతిగనే, దేహాది నియమాలన్నీ, చైతన్యం వల్ల గోచరిస్తాయి. అందుచేత అదిగూడ విశ్వచైతన్యమే.

దేహాది సకల విషయాలూ సూక్ష్మరూపంలో మనస్సులోనే వున్నాయి. మనస్సు మీద చైతన్యకాంతి ప్రసరించగానే మనసులోని ముద్రలన్నీ దేహముగా, లోకాలుగా వ్యక్తమౌతాయి. అహంకారం తనకు పరిధి గల్పించుకున్నది, కనుక, దేహము వేరుగా, ప్రపంచము వేరుగా తోస్తున్నది.

గది తలుపులు మూసి, ప్రక్కపై పడుకొని, కళ్ళు మూసుకొని కలలో లండన్, అచటి గుంపులూ, వానిలో నీవు అన్నిటినీ చూస్తావు. ఆ కలలోని ఒక వ్యక్తి నీవనుకుంటావు. లండనూ, యితరాలూ నీ గదిలోకి కాని, మనస్సులోనికి కాని చొరబడలేవు. అయినా అంత విస్తార దేశమూ, కాలమూ నీకు అవన్నీ నీ మనస్సు నుండి ప్రసరింపబడి ఉండాలి. ప్రపంచము ఎంతో విస్తృతమైనది. మనస్సు, చాలా చిన్నది, కాని అంత చిన్న ఆకాశంలో అంత పెద్ద విశ్వం

ఇమిడిపోవడం ఆశ్చర్యంగా లేదూ? సినీ తెర అతి పరిమితమైనా, దానిపై ఎన్ని చిత్రాలు కదలాడిపోవు? అన్నేసి ఘటనలు, వ్యక్తులూ బారులుగా ఒకటిపెంట ఒకటి అంత చిన్నతెరపై గడచిపోతుంటే నీవు వింతపడవూ? మనస్సూ, విషయాలూ గూడ అట్లే. గోచరించాయి.

భ: అయితే విశ్వచైతన్యం ఆత్మజ్ఞానం ఒకటి కాదా?

మ: విశ్వచైతన్యం, అహంకారం పెనుక ఉంటుంది. దానిని ఈశ్వరుడనీ, అహంకారాన్ని జీవుడనీ అనవచ్చు. ఈశ్వరుని బ్రహ్మమనీ అనవచ్చు. అక్కడ

ఎట్టి భేదమూ లేదు.

పరా = పరమము, సంపూర్ణము, బ్రహ్మము

ఈశ్వర = విశ్వచైతన్యము (మహత్)

జీవ మరియు జగత్ = వ్యక్తి మరియు జగత్తు. ఈశ్వరుని యందు కూడా విస్తరించి యున్న చైతన్యమే పరము (Absolute).

# భాషణములు 178

భ: విచార సంగ్రహంలో ఏదో జ్యోతిగురించి చెప్పారు. దాని నాత్మజ్యోతియని, దాని మూలమైన సత్యాన్ని కనుగొమ్మన్నారు.

మ: వేదాలు ఆ జ్యోతిని పేర్కొన్నవి. 'తస్యాశ్శిఖాయామధ్యే పరమాత్మా వ్యవస్థిత:' ఆ జ్యోతినీ జీవచైతన్యంగా తెలిసికోవచ్చు.

# భాషణములు 179

మోరిస్ ఫ్రీడ్మన్, స్వామి రామదాసుకూ తనకూ అయిన సంవాదాన్ని భగవాన్ ఎదుట చెప్పాడు. స్వామి రామదాసు తమకింక జన్మలు లేవన్నారు. ఫ్రీడ్మన్ అడిగాడు: పునర్జన్మలగూర్చి రామదాసు ఆందోళన కావడమెందుకు? ఎప్పుడైనా ఉండేది ఆ రాముడే, ఆ రామదాసే, రామునికైన ఆ అన్వేషణే, సిద్ధి తర్వాత ఆ ఆనందమే. ఇట్టి రామలీల లెన్నిమార్లు జరిగితే మాత్రం కాదనడమెందుకు? రామదాసులకు అది అభ్యంతరం లేదన్నారని. "అవును, అదియొక ఆట; ఆనందప్రదం; దానికి ప్రాతికూల్యం అనవసరమే. రాముడు తనలో లీనమైనాడు. ఆ ఐక్యం తనకెంతో హాయి కూర్చింది. తామిర్వురూ ఒకరే; కాని రామదాసూ ఉన్నాడు, రాముడూ ఉన్నాడు. వారి ఐక్యమూ వుంది, దానివలని ఆనందమూ ఉంది. అది నిత్యము' రామదాసుల ఈ సంవాదం గూర్చి శ్రీభగవాన్ అభిప్రాయమేమి? అని అడిగాడు ఫ్రీడ్మన్.

మహర్షి: ఇప్పుడు జరుగుతున్నవన్నీ ఎంత నిజమో, వారు తెలిపిందీ అంతే నిజం.

# భాషణములు 180

ఫ్రీడ్మన్: నిద్ర యొక మరపు; జాగ్రత్, మనః ప్రవృత్తి; నిద్రలో మనస్సు సన్నద్ధ స్థితిలో నుంటుంది.

మహర్షి: నిద్రలో నీవు లేవా?

భ: ఉన్నాను, కాని విస్మృతిలో ఉన్నాను. ఈ మరపునకూ, ఈ రెండవస్థల్లోనూ తాను అవిచ్ఛిన్నంగా ఉన్నాననే మనస్సుకూ ఒక సాక్షి ఉండాలి కదా?

మ: ఈ సాక్షి ఎవరు? నువ్వు 'సాక్షి' గురించి మాట్లాడుతున్నావు. ఈ సాక్షికి ఒక కర్మ (విషయం), ఒక కర్త వుండాలి. ఇవి మనస్సుచేత కల్పించబడినవి. ఈ సాక్షి భావమే మనస్సులోనిది. ఒకవేళ ఆ మరపుకు ఒక సాక్షి ఉంటే అతను "నేను మనసును చూసేను" అని చెప్తాడా? ఇప్పుడు నువ్వు అన్నావు. ఎమని? ఒకసాక్షి ఖచ్చితంగా ఉండి ఉండాలని. మరి సాక్షి ఎవరు? నువ్వు ఏమి చెప్పాల్సివస్తుంది. "నేను" అని మరి ఈ "నేను" ఎవరు? నువ్వు అహంకారంతో తాదాత్మ్యత చెంది "నేను" అంటావు. ఈ అహంకారపు "నేను" సాక్షా? ఇది చెప్పేది మనస్సు. అట్టి దానిని స్వయంగా చూడలేదు. స్వయంగా కల్పించుకొన్న పరిమితితో మనస్సుకూ, మరపుకూ సాక్షి ఉందని అనుకుంటావు. "నేనే సాక్షిని' అని కూడా అంటావు. మరుపును, (నిద్రను) చూసిన సాక్షి చెప్పాల్సి వుంటుంది. "నేను మరుపును చూసేను" అని. ప్రస్తుతం ఉన్న మనస్సు (మేలుకొని ఉన్న మనస్సు) అలా చెప్పడానికి కుదరదు. దీనికి ఆ స్థితి లేదు.

ఆ విధంగా ఆ అవస్థ మొత్తం నిరూపించరానిది అవుతోంది. చైతన్యం అపరిమితం. అది పరిమితమైన తర్వాత ఊరికే అది 9 స్థితిని తనపై వేసుకుంటోంది. సాక్షిగా చూడడానికి నిజంగా ఏమీ లేదు అది సరళమైన సత్యము, "ఉన్నది".

# భాషణములు 181

భ: "యద్గత్వా న నివర్తనే తద్ధామ పరమం మమ" ఆ ధామమేమి? అది విశ్వ చైతన్యానికి అవ్వలి పరబ్రహ్మస్థితియేనా?

మ: అవును.

భ: దాని తాత్పర్యం విశ్వచైతన్యస్థితి పొందినవారు ఇంకా అజ్ఞానపు పట్టునుండి విడుదల అవలేదని అర్థమా?

మ: బ్రహ్మలోకంతో సహా ఎల్ల లోకాలూ, పునర్జన్మను తప్పింపలేవని ఆ వాక్యానికర్థం. భగవద్గీతా శ్లోకంలో "నన్ను చేరిన, మరి పుట్టువులేదు ఇతరులందరూ బంధితులే", యని యుంది. మరొకటి 'గత్వా' (పోయి) అనే పదం గుర్తించు. గతి ఉన్నదనే గదా? గతి కలదని భావించిన తరువాత కాలము 'పునరావృత్తి' (తిరిగిరాక) ఉన్నట్లే గతి, పునరాగతి (జన్మ) సూచిస్తుంది. పుట్టుకంటే అహంకార పుట్టువన్న మాట.

పుట్టితే ఎచ్చటికైనా పోక (గతి) తప్పదు. పోతే, తిరిగి రాక (పునరాగతి) తప్పదు. కాబట్టి ఈ పదజాలం వదలిపేసి ఉన్నట్లే ఉండు. నీవేవరవో చూచి, ఆత్మలో నిలుకడచెందు. అప్పుడూ నీకు ముక్తి, పుట్టువు నుంచీ, రావడం నుండి. తిరిగి ఈ రాకపోకలనుండి.

భ: నిజమే. ఈ సత్యాన్నెన్ని మారులో విన్నాను. కాని అది మమ్మల్ని తప్పించుకుంటోంది. అందువలన దాన్ని మర్చిపోతున్నాం.

మ: అవునవును. అంచేతే దాన్ని పలుమార్లు జ్ఞప్తికి తెచ్చుకోటం అవసరం.

# భాషణములు 182

అదే రోజు ఆసక్తికరమైన ఫోటో ఒకటి కనబడలేదు. శ్రీభగవాన్ కలత చెందినట్లు కనిపించింది. ఇట్టి సందర్భాలలో భగవాన్ దృష్టి ఎట్టిది, అని ఫ్రీడ్మన్ ప్రశ్న. భగవానన్నారు "నన్ను పోలండ్ తీసుకొని వెడుతున్నట్లు కలగన్నావనుకో. నిద్రలేవగానే

నాతో అంటావు, 'నాకిట్లు కలవచ్చింది, మీకూ ఆ కలయే వచ్చిందా, కాక ముందే మీకు తెలిసిందా? దీన్ని గూర్చి మీ అభిప్రాయమేమి' అని ఇట్టిదే నీ ప్రశ్న

భక్తుడు: కానీ మీ ఎదుటి సంఘటనలనే మీరు ఎరుగరా?

మహర్షి: ఇవన్నీ మనఃప్రవృత్తులు - అట్టివే ఈ ప్రశ్నలూనూ.

రాములవారి సీతాన్వేషణలో ఒక ఘట్టం వివరించారు శ్రీభగవాన్. “రాముడు పూర్ణపురుషుడు గదా, సీత కనుపించకపోతే అంత దుఃఖించటమేమి?" అని పార్వతి శివుణ్ణి అడిగింది. "అయినా గూడ, రాముడు పూర్ణుడే" అన్నాడు శివుడు. కావలెనంటే సీతరూపుతో నీ వాయన వద్దకు పో, పరీక్షించి యేమవుతుందో చూడు". ఆమె అలాగే చేసింది. రాముడామె వేషాన్ని లక్ష్యపెట్టకుండా 'హా సీతా, హా సీతా' అని విలపిస్తూ, పార్వతిని గమనింపకుండా గుడ్డివానివలె సాగిపోయాడు. (సంవాదము 218లో కూడా ఈ విషయం ఉంది)

# భాషణములు 183

బొంబేవారొకరు - నే నరవిందాశ్రమంలో అమ్మను ఈ ప్రశ్న నడిగాను భగవంతుడు నిజస్వరూపంతో గోచరించుటకని ఆలోచనలన్నీ కట్టేసి, మనస్సును శూన్యంగా ఉంచుతాను. కాని నాకేమీ కనబడలేదు" ఆమె బదులిచ్చింది -- 'నీ యత్నం సరియైనదే. శక్తి ఊర్ధ్వం నుంచి క్రిందికి తరలి వస్తుంది. అది నీకే అనుభవం అవుతుంది' అని.

ఇటుపై నేనేం చేయవలెనో దయచేసి తెలుపవలసింది.

మహర్షి: నీవు నీవుగనే ఉండు. క్రిందికి దిగివచ్చేదిగాని, ప్రత్యక్షమయ్యేదిగాని ఏమీలేదు. అహంకారం పోగొట్టుకోవడం ఒక్కటే నీవు చేయవలసింది.

ఉన్నదేదో సదా ఉన్నదే. ఇప్పుడు కూడా నువ్వు అదే. దానినుండి నువ్వు వేరుగా లేవు. ఆలోచనలు లేని శూన్యస్థితిని చూసింది నువ్వే అది చూడడానికి నువ్వు అక్కడా వున్నావు. మరి దేని కోసం నీ నిరీక్షణ? ఏదో చూడలేదన్నలోటు, చూడవలెనన్న ఆపేక్ష, చూస్తే ఏమో లబ్ధి ఉంటుందన్న ఆశ - ఇవన్నీ అహంకారం ఆడే ఆట. నీవు అహంకారం వలలో చిక్కుపడ్డావు. వీని నన్నింటి నన్నదీ అహంకారమే, నీవుగాదు. నీవుగా ఉండు. అంతకు మించి చేయవలసింది లేదు.

# భాషణములు 184

మహర్షి: మూలాధారం అధోభాగంలో, మధ్యలో హృదయం, సహస్రారం వీటన్నిటికీ పై భాగంలో ఉన్నవనుకోటం, అంతా తప్పు. ఒక మాటలో చెప్పవలెనంటే, ఆలోచించటం నిజంగా నీ స్వభావం గాదు.

# భాషణములు 185

మన శాస్త్రాలలో ఈ క్రిందిలాంటివి కనిపిస్తాయి. "పలుకకనే పలికాడు"

“ఎప్పటివలెనే నిశ్చలంగా వుండి, చూపాడు" ఇత్యాది.

ఈ ఉచ్చరించని పలుకేది? అదే మౌనము, ప్రణవము మహావాక్యము" వీనిని గూడ 'శబ్ద'మనే అంటారు.

*మహావాక్యములు 1.తత్త్వమసి 2. అహంబ్రహ్మాస్మి 3. అయమాత్మా బ్రహ్మ 4. ప్రజ్ఞానం బ్రహ్మ.

# భాషణములు 186

మహర్షి: మనం వార్తాపత్రికను అందలి వ్యాసాలన్నిటినీ, సాకల్యంగా చదువుతాము; కాని వానిని ముద్రించిన కాగితాన్ని పరిశీలించము. ఊకను గ్రహించి సారాన్ని వదిలేస్తాము. ఆ పత్రికా వ్యాసాలన్నింటికీ ఆధారం కాగితం. ఆధారం తెలిస్తే, మిగతవన్నీ తెలుస్తాయి. (గోడపై చిత్రణాలవలె)

భక్తుడు: ఉన్నది ఒక్కటే, అది సత్యం అన్నారే, ఆ ఏకైకమేది?

మ: ఆ ఏకైకము సత్, ఉనికి. అదే మనం చూచే విశ్వం, విషయములుగా, మనంగా కూడ కనుపించేది.

భ: ఆత్మ అంటే ఏమి? ఆత్మకు పరమావధి (ఫైనాలిటీ) అంటూ ఉన్నదా?

మ: మొదట ఆత్మను తెలుసుకో. ఆపైన దాని అవధి ఉందో లేదో తర్కించవచ్చు.

నీవు ఆత్మయని దేని నంటున్నావు.

భ: జీవుడే ఆత్మ.

మ: జీవుడెవరో తెలుసుకో. జీవునికి ఆత్మకూ భేదమేమి? జీవుడే ఆత్మయా లేక ఆత్మయని వేరొకటున్నదా? నీవు చూచేదానికి తుదియొకటి ఉంది. సృజింపబడినదానికి అంతమో, నాశమో ఉండక తప్పదు. సృజింప బడని దానికి అంతం లేదు. ఉన్న దానిని గమనించలేము. అది మన దృష్టి కందనిది, మనకు కనుపించేదేదో దాన్ని తెలుసుకోవాలి. దాని నాశమే, దాని అంతం, ఉన్నదేదో అది ఎప్పుడూ ఉండేది; క్రొత్తగా కానవచ్చేది, తరువాత నష్టమౌతుంది.

భ: మానుషాకృతిలో జనించాక జరిగేదేమి? జీవుని గతియేమి?

మ: మనమెవరమో ముందు తెలిసికొందాము. మన మెట్టివారమో, మన కర్థం కాలేదు. అది తెలిసినంతవరకు, ఈ ప్రశ్నకర్థం లేదు. (ఇక్కడ భగవాన్ దేహాత్మ బుద్ధిని ప్రస్తావించుట స్పష్టమే. చావు పుట్టువుల గూర్చిన మన సందిగ్ధత ఆత్మను దేహమనుకొన్నందువల్ల కలిగినది. నిజానికి ఆత్మకు చావూలేదు, పుట్టువూ లేదు. పంచభూతాలు దాని నంటవు.) గీత 2-11 అశోచ్యాన్ అన్వశోచస్త్వం ప్రజ్ఞా వాదాంశ్చ భాషసే, యిత్యాది) పుట్టింది అసలు ఏదీ. ఎవరిని మనిషిగా ఎన్నుతావు? చావు పుట్టువుల, మృతి తర్వాతి విషయాల వివరాలు వెదకేకన్న ఇప్పుడు నీవెవరవు, ఎట్లున్నావు అని విచారిస్తే, అట్టి ప్రశ్నలే పైకి రావు. మూడవస్థల్లోనూ నీవు సమమే. జీవుడు “నేను” అనే ఆలోచనా కాక దేహమా? అది ఆలోచనా కాక ప్రకృతేనా? లేక బ్రతికి ఉన్నామనే మన అనుభవం మన స్వభావమా? “యదాతేమోహకలిలం బుద్ధి..." (గీత 2-52) అన్న శ్లోకాన్ని భగవాన్ చెప్పారు.

భ: ఆత్మ విచారమెందుకు అవసరం?

మ: ఆత్మ విచారం చేయకుంటే, లోకవిచారం చొరబడుతుంది. లేని దానిని వెదకడంతో, స్ఫుటమైన దానిని వదులుకోవడ మవుతుంది. ఆత్మ సిద్ధించగానే, విచారం గూడ ఆగిపోతుంది నీవాత్మ నిష్ఠుడౌతావు, దేహమాత్మ యనుకొన్నంతకాలం, ఆత్మస్పష్టమైందనీ, దానికై వెదకుతున్నా మనుకోడమేగాని, నిజంగా ఆత్మ నష్టంగాదు. అది ఎప్పుడూ ఉంది. దేహాన్ని 'ఆత్మయని, ఒక ఇంద్రియాన్ని ఆత్మయనీ, జీవాత్మయనీ, పరమాత్మయనీ, ఇట్లు వారు పేర్కొనే ఆత్మలూ వందలూ వేలూ! ఈ ఆత్మాన్వేషణము (ఆత్మ విచారము) నిజమైన ఆత్మను తెలిసికోడానికి.

## కేవల సమాధి, సహజ సమాధి

# భాషణములు 187

భక్తుడు: నిరంతరమైన ఆత్మధ్యానం కారణంగా, శరీరం నిశ్చలమై, సమాధిమగ్నులు కాగలరని నా నిశ్చయం. శరీరం కర్మలు చేస్తూ ఉండవచ్చు. నిష్క్రియమూ కావచ్చు. ధ్యాన నిష్ఠమైన మనస్సును దేహంగాని, ఇంద్రియ చాంచల్యంగాని బాధించదు. మనస్సు చలించినప్పుడెల్లా శరీరం క్రియా ప్రవృత్త మవుతుందనే నియమం ఏమీలేదు, అనియొకరు; మరియొకరు, శారీరకమైన అలజడి నిరంతరంగా నిర్వికల్ప సమాధిని సాగనీక, విధిగా భంగం చేస్తుందంటారు. మీ నిశ్చయమేమి? నా వాదానికి ప్రత్యక్ష ప్రమాణము తామే గదా?

మహర్షి: ఇరువురు చెప్పినదీ సరియే. నీవన్నది సహజ నిర్వికల్ప సమాధి. వారు పలికింది, కేవల నిర్వికల్ప సమాధి. కేవలంలో మనస్సు ఆత్మప్రకాశంలో మునిగి ఉంటుంది. (అది నిద్రలో అజ్ఞాన తమస్సులో అడగియుంటుంది); కర్తకు మంచి చెడుగుల వేర్పరచు వివేచన ఉంటుంది. వీనిమార్గంలో అవరోధాలు చాల ఉన్నాయి. సమాధి, సమాధి విరమణ; తరువాతి విషయ ప్రవృత్తి: శరీరంనకు, దృష్టికి, ప్రాణమునకు మనస్సుకు కలిగే అశాంతి; కర్మవిషయ పరిజ్ఞానము మరియు కర్మప్రవృత్తి అన్నీ అడ్డంకులే.

కాని సహజ నిర్వికల్పసమాధిలో మనస్సు ఆత్మలో లీనమై స్పష్టమౌతుంది. పైన పేర్కొన్న భేదాలు, ఆటంకాలు, ఇచ్చట వర్తిల్లవు. అతని చర్యలు, నిదురించే శిశువు భుజించుట వంటివి- చూచేవానికేగాని, భుజించేవానికి తెలిసేది గాదు. నిద్రిస్తూన్న బండి (తోలు) వానికి, మనస్సు తమోమగ్నం కాబట్టి, బండి కదలికలు తెలియవు. ఆ రీతిగానే సహజజ్ఞానికి తన దేహంగాని దాని చర్యలుగాని స్పృహలో ఉండవు. అతని మనస్సు చిదానంద పారవశ్యంలో లయించి మృతమైనది కనుక.

నీ ప్రశ్నలో రెండు పదాలు - ధ్యానము, సమాధి - అస్పష్టార్థంగా ఉపయోగించబడ్డాయి. (లూస్గా వాడబడ్డాయి) ధ్యానము, ప్రయత్న సాధ్యము; సమాధి అయత్న సిద్ధము.



| నిద్ర | కేవల నిర్వికల్పసమాధి | సహజ నిర్వికల్పసమాధి |
|---|---|---|
| 1. మనస్సు సచేతనము (సజీవము) | 1. మనస్సు సచేతనము (సజీవము) | 1. మనస్సు నష్టము (మృతము) |
| 2. విస్మృతిలో నిమగ్నము. | 2. తేజోమగ్నము | 2. ఆత్మలో లీనము |
| | 3. త్రాడుతోసహ బావిలో విడిచిన చేదవలె | 3. సముద్రంలో గలిసి వ్యక్తిత్వము పోయిన నదివలె |
| | 4. త్రాటికావలి చివరను పట్టి చేదను పైకి తీయాలి | 4. సముద్రమునుండి నదిని మరలించుట అసాధ్యము. |

## భాషణములు 188

మనస్సారము, ఎరుక, లేక చైతన్యము. దానిపై అహంకార ప్రాబల్యం ఉంటే అది వివేచన, యోచన, ఇంద్రియ జ్ఞాన శక్తులుగా పనిచేస్తుంది. శుద్ధ చైతన్యానికి మనస్సు ఏలాటి పరిమితినీ విధించలేదు. అందుచేత శుద్ధచైతన్యం తనకు వేరుగా ఏమీలేక, కేవల జ్ఞానంగా నిలిచిపోతుంది. బైబిల్ పలికిన 'నేనది నేను' అర్థం ఇది.

అహంకార వశమైన మనస్సు శక్తి హీనమై దుర్బలమై తన్ను బాధించే ఆలోచనలను ఎదుర్కోలేకపోతుంది. అహంకార రహితమైన మనస్సు కలల నెరుగని గాఢనిద్రలో హాయిగా ఉంటుంది. కాబట్టి దుఃఖము ఆనందము కేవలము మనః ప్రవృత్తులగుట స్పష్టమే. కాని వానిలో బలదుర్బల ప్రవృత్తులు తమ తమ స్థానాలను పరస్పరం మార్చుకోలేవు. కర్మప్రవృత్తి బలహీనం, కాబట్టి దుఃఖనిలయము; ఔదాసీన్యం శక్తి సంపన్నము, గనుక ఆనందదాయకము, దాని శక్తి నిద్రాణం అగుటవల్ల దానిని సరిగా వినియోగించుకోరు.

విశ్వచైతన్యము ఏ యరుదైన వ్యక్తిలోనో ఆవిష్కరిస్తుంది. అతడు దుర్బల మనస్సు (జీవాత్మ)ను విశ్వాత్మతో సంధిస్తాడు. ఆ అరుదైన వ్యక్తియే గురువు, లేక వ్యక్తిమైన దైవము అనబడతాడు.

## భాషణములు 189

పారిస్ విశ్వవిద్యాలయమునకు చెందిన ఎం. అలివర్ లాకోంబ్, ఫ్రాన్స్ దేశీయుడు, నడవయస్సు. అచటి భారతీయ సంస్కృతి విద్యాలయం వారి ప్రతినిధిగా ఇండియాకు వచ్చి ఫ్రెంచి ఇండియానుండి తిన్నగా తిరువణ్ణామలై వచ్చి చేరాడు. మహర్షిని చూడగోరిన ఆ ప్రతినిధులలో ఇతడొకడు. ఆశ్రమంలో మూడు గంటలున్నాడు. భగవద్గీత, ఉపనిషత్తులు, శంకర రామానుజుల భాష్యములతో సూత్రగ్రంథములను సంస్కృత మూలంలో చదివియున్నాడు. ఆయన అడిగాడు -

భ: మహర్షి బోధ శ్రీశంకరుల బోధలేనా?

మః మహర్షి బోధ, వచోరూపంలో, వారి స్వానుభవము, ఆత్మజ్ఞానము. అది శంకరులు చెప్పిన దానితో సమానమని ఇతరులు అంటారు.

భ: సరే. అదే ఆత్మానుభవాన్ని వేర్వేరు రీతిలో తెలియబలుక గలమా?

మ: ఆత్మజ్ఞాని భాష అతని భాషయే. మౌనం సర్వోత్తమ భాష,

భ: హఠయోగ, తాంత్రిక ప్రయోగములపై మహర్షి అభిప్రాయమేమి?

మ: ఇపుడాచరణలో ఉన్న ఏ విధానాన్ని మహర్షి ఖండించరు, మనః శ్శుద్ధికైతే అన్ని ప్రయోగములూ మంచివే. శుద్ధమైన మనస్సు మాత్రమే మహర్షి బోధనలను గ్రహించి వాటిని అభ్యాసంచేసి ఆచరణలో పెట్టగలదు.

భ: కర్మ, భక్తి, జ్ఞాన హఠయోగములలో ఉత్తమమేది?

మ: ఉపదేశసారంలోని పదవశ్లోకం చూడు. ఆత్మనిష్ఠ ఈ అన్ని యోగముల పరమార్థము.

కలలు లేని నిద్రలో ప్రపంచము లేదు, అహంకారము లేదు. అసౌఖ్యము లేదు; ఆత్మ మిగిలే ఉంది. జాగ్రత్తులో అవన్నీ ఉన్నవి, ఆత్మ కూడ ఉంది. తాత్కాలికాలైన సంభవాలను తొలగద్రోస్తే చాలు, ఆత్మనిశ్రేయస్సు సిద్ధిస్తుంది. అది

నిత్యసిద్ధమే. ఆనందం నీ స్వభావము. దేనిపై సర్వమూ ఆరోపితమైనదో దానిని కనుక్కో అప్పుడు నీవు శుద్ధ ఆత్మస్థితుడవౌతావు.

భ: అవును. నిత్యసిద్ధులైన ఆత్మలబ్ధికి అన్యపరిధులను తొలగింపవలెనన్న మాట. శ్రీ శంకరులన్నదీ అదే. పొందుటాలేదు. పోగుట్టకొనుటాలేదు.

భ: సాధకుడు సామాన్యంగా పనిని ఎలా చేయాలి?

మ: కర్త తానన్న భావన మాని. ఉదాహరణకు.. నీవు పారిస్లో ఉండగా ఇక్కడికి రావలెననుకున్నావా?

భ: లేదు.

మ: ముందుగా అనుకోకనే నీవు వర్తించడం చూడు. ఎవ్వడూ నిష్క్రియుడుగా ఉండలేదంటుంది గీత. నీ కిష్టమైనా, కాకున్నా నీ పుట్టువు ప్రయోజనము పూర్తి అయ్యే తీరుతుంది. ఆ ప్రయోజనము తానై ఫలించనీ,

భ: అన్నన్ని మార్గాలెందుకు చెప్పారు? శ్రీరామకృష్ణులు, మోక్షానికి అత్యుత్తమ మార్గం భక్తియన్నారు.

మ: సాధకుని దృష్టినిబట్టి వాని మార్గం. నీవు భగవద్గీత చదివావు. శ్రీ కృష్ణులేమన్నారు? 'నేను గాని, నీవు గాని, యీ రాజలోకముగాని ఒకప్పుడునూ లేకపోయింది లేదు. ఇక పైన గూడ ఉండకపోవు. లేని వస్తువున కునికి లేదు. ఉన్న సత్య వస్తువు లేకనూపోదు. పూర్వము ఉన్నది, యిప్పుడునూ ఉన్నది; ఇక ముందునూ ఉండగలదు" మరోచోట, "ఈ అవినాశి యోగమును నేను సూర్యునికి చెప్పియుంటిని. అతడు మనువునకు ..." అర్జునుడన్నాడు 'అదెట్లు? నీ వీ మధ్యనే క్రొద్దియేండ్ల క్రితమే, పుట్టావు. సూర్యుడేనాటివాడో! వానికినీ నీవుపదేశించియుండుటేమి?" 'శ్రీకృష్ణులు బదులు పల్కిరి - "అర్జునా! నీకును, నాకునూ, చాల జన్మలు గడచాయి. వాని నన్నింటినీ నే నెరుగుదును. నీ కవి తెలియవు. ఆ పూర్వజన్మల ఘటనలను నీకు తెలుపుచున్నాను."

ఈ వింత చూడు. "నీవు లేవు, నేను లేను, ఈ రాజలోకమూ లేదు" అంటున్న శ్రీకృష్ణుడే పూర్వం తానెన్నో జన్మలెత్తియుంటినని ఇప్పుడన్నాడు. ఈ వాక్యాల్లో విరోధము పై కగుపించిన, అది కృష్ణుడు తన మాటలను తానే ఖండించికోవడానికి కాదు. అర్జునుని దృష్టి కనుగుణంగా, అతని సమతరంలో వానితో భాషించాడు.

బైబిల్ లోనూ, దీనిని పోలినదే జీసస్ వాక్యమొకటి "అబ్రహాంకు పూర్వము గూడ నేనున్నాను" అని. యోగుల వాక్కులు, కాలదేశ పాత్రలకు పరిసరములకు తగినవిగా వుంటాయి.

లాకోంబ్ వెళ్ళవలసిన సమయం అయింది. 'చాల చింతతో వెళ తున్నా'నన్నాడు.

నవ్వుతూ మహర్షి యందుకున్నారు. "పోకలేదు, తిరిగి రాక లేదు" అంతలో ఫ్రాన్స్ దేశీయుడు "ఈయన కాలదేశముల కతీతు"డంటూ పుదుచ్చేరి ప్రయాణమైయాడు.

# భాషణములు 190

భగవాన్ హాలులో మచ్చిక అయిన ఉడుత ఒకటి, చీకటి పడగానే తన బోనులోకి సాధారణంగా వెళ్ళిపోయేది. భగవాన్ దానితో 'రాత్రికావచ్చింది, ఇక లోనికి వెళ్ళు'మని చెప్పబోతున్నారు.

ఆ హాల్లో తా నాత్మజ్ఞానం (సమాధి) పొందానని ప్రకటించినాయన ఒకడున్నాడు. ఆయన 'సాయంత్రం అంతా వేడిగానే ఉంది; దానికి దాహంగా ఉంటుంది; కొంచెం నీరు త్రావించండి'అన్నాడు. జంతువుల నంతగా అర్థం చేసుకోగలనన్న ధీమా

అగుపించింది, ఆ అనడంలో. కాని ఆ సలహాసెవ్వరూ పట్టించుకోలేదు. తన సలహా నతడు రెట్టించాడు. మహర్షి కాసేపు ఊరకుండి, అన్నారు. 'నడియెండలో, బాగా వేడెక్కిన రాతిపై కూర్చుండి' అంతకాలం ధ్యానం చేసిన నీకు చాల దాహమై ఉండాలి. ఒక చెంబుడు నీరైనా అవసరముంటుంది',

భక్తుడు: నిజమే, నేను నీరు కావలసినంత పుచ్చుకొన్నాను.

మహర్షి: ఉడుత కంత దాహం కాలేదు. ఎండ వేడిమిలో అనుష్ఠానం అంత చేసిన నీకు దాహం అవుతుంది. దానిసే ఉడుతకు విధించడమెందుకు?

అక్కడి వారితో మహర్షి చెప్పారు. వేడి రాతిపై, సూర్యునకు ఎదురుగా కనులు మూసికొని, నిలుచున్న అతన్ని నేను గమనించాను. అక్కడ కాసేపు ఆగాను; కాని అతన్ని కదల్చట మెందుకని వచ్చేశాను. వీరు తమ కిష్టమైనట్లే చేస్తారు.

భ: అది నేను ముందుగా అనుకొని చేసింది కాదు. అది అప్రయత్నంగా జరిగింది.

మ: ఓహో, అలాగా! మామటుకు మేమందరము ఏం చేసినా ముందనుకొనే చేస్తాము. నీవు అందరినీ దాటిపోయావన్న మాట!

ఈ నే నిట్లు చేయడం ఇది మొదటిసారి గాదు. నాకా ఉత్సాహము ఇచ్చి అట్లు చేయించేది మీరే. అట్లయి గూడా ఎందుకలా చేశావని గద్దిస్తారు. అలా అయితే, ఎలాగ?

మ: అదా విషయం? ఆ పనులన్నీ నా అనుమతితోసే చేస్తున్నావన్న మాట. ఆ కర్మఫలం అంతా నాదేగాని నీది కాదన్న మాట.

భ: సందేహమేమి? నేనుగా కోరి ఏ పనీ చేయను. నాకని నాకే కోరికా లేదు.

మహర్షి: ఈ చెత్తఇంక ఆపు. ఇలాగే దుర్యోధనుడూ అన్నాడు:

జానామి ధర్మం న చ మే ప్రవృత్తిః
జానామ్య ధర్మం, న చమే నివృత్తిః.
కే నాపి దేవేన హృది స్థితేన
యథా నియుక్తోస్మి తథా కరోమి.

మీ ఇద్దరిలో తేడా ఏమిటి?

భ: తేడా నాకేమీ కనబడదు. కాని నాకే కోరికా లేదు. అది లేకనే పనులు చేస్తాను.

మ: మామూలు వాళ్ళ నందర్నీ దాటిపోయావన్న మాట. మే మితరులం పురుషార్థంతో పనులు చేస్తాం.

భ: అదెట్లు స్వామీ? మీ గ్రంథాల్లో సెలవీయలేదా, కర్మ అప్రయత్నంగానే జరగవచ్చని.

మ: చాలిక ఆపు. నీవూ, నీలాంటివాడే మరొకడూ లోకాతీతులుగా (ట్రాన్సెండెంటల్ బీయింగ్స్) ప్రవర్తిస్తున్నారు. ఇద్దరూ చాల చదివినవారే. ఇహ నేర్చుకోవలసిందే లేదు. పలుమార్లు ఇక్కడికి వస్తున్నావు గనుక ఇంతా చెప్పాను. నీ యిష్టం వచ్చినట్లు చేయి. ఆరంభకుని దశలోని ఈ వెర్రి వెర్రి చేష్టలు, కొద్ది కాలంలోనే వాని నిజరూపంతో బయటపడతాయి.

భ: కాని నేనీ దశలో చాలా కాలంగా ఉన్నానే.

మ: ఇక ఆపు.

# భాషణములు 191

ఆశ్రమవాసి కోహెన్ యోగపద్ధతిని గురించి అడిగారు.

మహర్షి: పతంజలి మొదటి సూత్రం యోగవిధాలన్నింటికీ వర్తిస్తుంది. చిత్తవృత్తులను నిరోధించడం దాని ప్రయోజనం. పద్ధతుల్లో భేదాలుండవచ్చు. ఆ గమ్యానికై ఉద్దేశించి ప్రయత్నం చేస్తే దాన్ని యోగమంటారు. ఆ ప్రయత్నమే. యోగం.

చిత్తవృత్తి నిరోధానికి చాలా మార్గాలున్నాయి

1. మనస్సునే పరిశీలించడం. ఆ పరిశీలనలో మనోవృత్తులు తమంతమే ఆగిపోతాయి. ఇది జ్ఞానమార్గం. శుద్ధ మనస్సే ఆత్మ.

2. మనస్సు మూలాన్ని వెదకటం. ఆ మూలాన్ని దైవమనీ, ఆత్మయనీ, చైతన్యమనీ పిలుస్తారు.

3. ఏకచింతన. ఒకే తలంపుపై చింతనవల్ల, ఇతర తలంపులన్నీ మాయమౌతాయి. చివరకి ఆలోచన కూడా మాయమౌతుంది.

4. హఠయోగము.

పద్ధతులన్నీ సమమే. అన్నిటికీ గమ్యమొకటే గనుక ఆలోచనలను నిరోధించేటప్పుడు జాగురూకతతో ఉండడం అవసరం. లేకుంటే అది నిద్రకు దారి తీస్తుంది. జాగురూకత (Awareness) అత్యంత ముఖ్యమనడానికి పతంజలియే ఆధారము. ఆయన ప్రాణాయామము తర్వాత గూడా ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులను ప్రతిపాదించారు. ప్రాణాయామము మనస్సును స్థిరపరచి ఆలోచనలను అణచివేస్తుంది. ఆపైని ఇంకా వృద్ధియేమి? అంటే జాగురూకతకు అంత ప్రాధాన్యమన్న మాట. అట్టిస్థితిని మార్ఫియా, క్లోరోఫారం ఇత్యాదుల సాయంతో అనుకరించవచ్చు. అట్టి సమయాల్లో జాగురూకత (Awareness) ఉండదు కనుక అది మోక్షానికి సాయపడదు.

# భాషణములు 192

మాటవరుసగా భగవాన్ వివరించారు. ముక్తి ఎవరికి కావాలి? ప్రతివానికీ సుఖం మాత్రమే కావాలి. అది గూడా ఇంద్రియ తృప్తి మూలాన వచ్చేవి. ఒకరు అడిగిన ప్రశ్నకు బదులుగా గురువు "నీవన్నది సరే. ఇంద్రియ తృప్తి ఇచ్చే సుఖం, ముక్తి వలన వచ్చే సుఖం ఒకటే. అట్టి ముక్తి కావాలన్న కోరిక (ముముక్షు) సాధన చతుష్టయంలో ఒకటి. అది అన్ని పద్ధతులకూ సమానమే. కాబట్టి ఆత్మజ్ఞానానికందరూ అర్హులే" యన్నారు.

నిజానికి యోగ సూత్రాదుల్లో సాధకునికి చెప్పిన అధికారిత్వం అంటే అర్హత పూర్తిగా కలవాడు ఈ ప్రపంచంలో ఎక్కడా కనిపించకపోవచ్చు. కాని అంత మాత్రానికి ఆత్మజ్ఞానం కోసం ప్రయత్నం మానకూడదు.

తాను ఆత్మయన్నది ప్రతివాని అనుభవమే. కాని వాడది గుర్తింపక దేహమే తానని బాధపడతాడు. ఇదే అన్నిటికంటే ఆశ్చర్యం. ఆత్మయే తాను; అలాంటప్పుడు, ఆత్మలోనే స్థితుడై, బాధలన్నీ ఎందుకు పోగొట్టుకోకూడదు?

తన్ను దేహమాత్ర మనకుంటున్నాడు గనుక వానికి మొదట నేర్పవలసింది. తాను దేహమాత్రం కాదనీ మరెన్నో గూడ అని. దేహం వానిలో ఒక్క అంశమే. ఆ విషయం చివరికెట్లో తెలుసుకుంటాడు. వాడు జడ పదార్థానికి చైతన్యానికి భేదం ఎరిగి, చైతన్యంగానే ఉండిపోవాలి. అప్పుడు వానికి తెలియవస్తుంది జడం చైతన్యం నుండి భిన్నం కాదని.

ఇది వివేకము. ఆరంభించిన వివేచన చివరివరకూ నిలిచి ఉండాలి. దాని ఫలం మోక్షం.

# భాషణములు 193

మ: పురుషార్థము, ప్రారబ్ధము ఎప్పుడూ ఉండేవే. పూర్వజన్మలో చేసిన కర్మల ఫలమే ప్రారబ్ధము. దానికి దేహంతో సంబంధము. దేహం తన ఇష్టం వచ్చినట్లు పోనీ, దానితో నీకేం? దాని నసలు గమనించడమెందుకు? దేహ మున్నంత కాలం పురుషార్థం, ప్రారబ్ధం రెండూ ఉంటాయి. కాని జ్ఞానం ఆ రెంటినీ అధిగమిస్తుంది. జ్ఞానాజ్ఞానముల రెండింటి కవ్వలిది ఆత్మ. ఏం జరిగినా అది పురాకృత కర్మలవల్లా, దైవేచ్ఛవలన మరియు ఇతర కారణాల వలన జరుగుతుంది.

# భాషణములు 194

అమలాపురం సుబ్బారావు: మనస్సు నెట్లు వశం చేసుకోవడం?

మ: మనస్సును పట్టుకో.

భ: ఎలా?

మ: మనస్సుకు రూపం లేదు. నిజానికి అది లేదు. దాన్ని స్వాధీన పరచుకొనేందుకు సునిశ్చిత మార్గం దాన్ని వెదకడమే. అప్పుడు దాని ప్రవృత్తి సర్వం అణగిపోతుంది.

# భాషణములు 195

శ్రీ జర్కా అని బెనారస్ యూనివర్సిటీనుంచి ఒకరు ఎం.ఎ; ఎం. ఎస్సి డిగ్రీలు పొందినవారు వచ్చి, భార్య, పిల్లలు చనిపోవడం వలన చాలా దుఃఖంగా ఉన్నానని, మనశ్శాంతి నిమ్మనీ, దాన్ని పొందేమార్గం చూపమనీ శ్రీభగవానును ప్రార్థించారు.

మ: చావుపుట్టుకలూ, సుఖదుఃఖాలు, ఈ ప్రపంచమూ, అహంకారము అన్నీ ఉన్నది మనస్సులోనే. మనస్సు నాశమైతే అవన్నీ నాశమౌతాయి. మనస్సు పూర్తిగా నాశనం కావాలి అని గుర్తుంచుకో. నిద్రాణం చేసినంత మాత్రం చాలదు. ఎందుకంటే నిద్రలో మనస్సు అవ్యక్తంగా ఉంటుంది. దానికేమీ తెలియదు. కాని మేల్కొనగానే, నీవు మునుపటి రీతిగానే వుంటావు. దుఃఖానికి అంతంటూ లేదు. కాని మనస్సు నాశమైతే, దుఃఖానికి ఆలంబనం ఉండదు. మనస్సుతో పాటు అదీ అదృశ్యమౌతుంది.

భ: మనోనాశనం ఎలా చెయ్యాలి?

మ: దానికై వెదకు. వెదకితే అది కనబడకుండా పోతుంది.

భ: నాకర్థం కావడం లేదు.

మ: మనస్సు, ఆలోచనల మూట. అలోచించే వాడుంటేనే ఆలోచనలు వస్తాయి. ఆ ఆలోచించేవాడే అహంకారం. దాన్ని అన్వేషిస్తే అది తానై మాయమవుతుంది. అహంకారము మనస్సూ ఒకటే. అన్ని ఆలోచనలకూ మూలం అహంకారం. దాని నుంచే మిగిలిన ఆలోచనలన్నీ పుట్టేది.

భ: మనస్సును వెదకే దెలాగ?

మ: లోన మునుగు. లోనుంచే మనస్సు వెలువడుతుందని నీ కిప్పటికే తెలుసు. కాబట్టి లోనమునిగి దాన్ని పట్టుకో.

భ: ఇప్పటికీ అదెలా చేయడమో తెలియటం లేదు.

మ: నీవు శ్వాస నియమం అభ్యసిస్తున్నావు గదా! దాన్ని యాంత్రికంగా చేస్తున్నంత కాలం గమ్యాన్ని చేరలేవు. అది కేవల మొక సాధనమే. శ్వాసను నియమించినంత సేపూ జాగురూకతతో 'నే'నన్న ఆలోచనను మరవక, దాని మూలాన్ని వెదకు. అప్పుడు, శ్వాస యే స్థానంలో అడగిపోతున్నదో అక్కడనుంచే 'నే'నన్న తలపు వెలికిరావటం తెలిసివస్తుంది. ఆలోచనలు ఒక కట్టుగా అణగిపోతాయి. ఒక కట్టుగనే లేస్తాయి. శ్వాసతో 'నే'నన్న తలపుగూడ మునుగుతుంది. దానితోనే తేజస్వంతమూ అనంతమూ అయిన మరొక 'అహం-మహం'స్ఫురిస్తుంది; అది అనవకాశమూ, అచ్ఛేద్యమూనూ. దానికి ఎన్నో పేర్లు పెట్టేరు. దైవము, ఆత్మ, కుండలినీ శక్తి, చిత్, యోగము, భక్తి, జ్ఞానము - యిత్యాది.

భ: ఇంకా స్పష్టం కాలేదు.

మః ప్రయత్నించు, ఆ ప్రయత్నమే నిన్ను గమ్యానికి చేరుస్తుంది.

# భాషణములు 196

చూడవచ్చిన వారొకరు రమణగీత - రెండవ అధ్యాయంలో పేర్కొన్న మూడుపద్ధతులను గురించి అడిగేరు.

దానికి మహర్షి వివరణమిట్లు- మనస్సును స్వాధీనం చేసుకోడానికి ప్రాణాయామం రెండు విధాల సాయపడుతుంది. 1. ఆలోచనలను అణచిగాని, 2. ఆలోచనలను నాశనం చేసిగాని, శ్వా+ సనియమనం, పూరక, కుంభక, రేచకములు, మూటితోనూ లేక, కేవలం కుంభకంతోనూ అభ్యసించవచ్చు. ధ్యానం అభ్యసించేవాడు, ముందు మనస్సు నధీనంచేసుకుంటాడు. ఆ మూలంగా శ్వాసనియమనం జరుగుతుంది; వానికి కుంభకం దానంతట అదే సిద్ధిస్తుంది. శ్వాస తీసుకోవడం వదలటం, వీనిని పరిశీలించటం గూడ శ్వాస నియమనమే. ఇవి మూడు భిన్న మార్గాలుగా గోచరిస్తాయి, గాని నిజంగా అవి ఒకే గమ్యానికి దారి తీస్తాయి. గనుక, మూడూ ఒకటే. కాని సాధకుని వాసనలబట్టి మరియు వాని పరిణతి కనుగుణంగా, ఆ మూడింటిలో ఒకటి ఎన్నుకుంటాడు. యథార్థంగా రెండే మార్గాలు -విచారము, భక్తి. ఈ రెండూ ఒకదానికొకటి సాయపడతాయి.

భ: 'నేను' నన్వేషిస్తే చూడటానికేమీ ఉండదే?

మ: ఎందుకంటే నీవు, నిన్ను దేహంతో తాదాత్మ్యం చెందడానికి అలవాటు పడ్డావు. అలాగే చూపు అంటే కళ్ళతో చూసేదే అని అలవాటు పడ్డావు. అందువలన "నేను" కోసం చూస్తే ఏమీ కనిపించడం లేదు అంటున్నావు. చూసే దానికి ఏముంది? చూసేదెవరు? చూసేదెలా? ఉన్నది ఒక్క చైతన్యమే. అదే "నేను"గా పుట్టి దేహంతో తాదాత్మ్యం చెందుతుంది. అదే కళ్లనుండి వెలువడి చుట్టూ ఉంటే విషయాలను గుర్తిస్తుంది. వ్యక్తి జాగ్రదావస్థలో పరిమితుడు అందుకే అతడు వేరే ఏదైనా చూడాలనుకుంటాడు. అతని ఇంద్రియాలు ఏమి సాక్ష్యమిస్తాయో అదే నిజం. కాని అతడు చూసేవాడు, చూడబడేది, చూచుట అన్నీ చైతన్యం యొక్క వ్యక్తీకరణమే అనీ, ఇవన్నీ "అహం - అహం" స్ఫురణ వ్యక్తీకరణలే అనీ అంగీకరించడు. ధ్యానము (లేదా నిది ధ్యాసనము) ఆత్మ కంటికి కనిపించాలి అనే భ్రాంతిని దూరం చెయ్యడంలో ఎంతో

సహాయకారి. నిజానికి చూసే దానికి ఏదీలేదు. ఇప్పుడే మాత్రం "నేను" ఎలా తెలుస్తోంది? నీముందు అద్దం పెట్టుకుంటే తెలుస్తోందా? "నేను" చైతన్యం. దీన్ని గుర్తించు, అనుభవించు. అదే సత్యం.

భ: ఆలోచనల మూలాన్ని శోధిస్తూండగా, "నేను" గోచరిస్తున్నట్లు అవుతుంది. కాని నాకది తృప్తికరంగా లేదు.

మ: లేకపోవచ్చు. 'నేను' గోచరించింది, ఏదో రూపంతో, బహుశ దేహంతో సంయోగించి ఉంటుంది. శుద్ధాత్మకు ఏ సంసర్గమూ లేదు. ఆత్మ నిస్సంగి, శుద్ధ సత్యం. దాని తేజస్సునందే దేహము, అహంకారము ప్రకాశిస్తాయి. ఆలోచనలన్నీ అణగిన తర్వాత మిగిలియుండేది శుద్ధ చైతన్యం.

నిద్రనుంచి మేలుకోగానే, జగత్తు స్ఫురించకపూర్వం, శుద్ధమైన "అహం - మహం" స్ఫూర్తి ఉంటుంది. మరల నిద్రపోక, అన్యచింతలనకు లోనుగాక దానినే పట్టుకో. ఆ (తతో) దానిని దృఢంగా చిక్కించుకొంటే, ఆపైన జగత్తు కన్పించినా పరవాలేదు. విషయములు చూచువానిని విషయములు బాధించవు.

# భాషణములు 197

గుల్, షిరీన్ బైరాంజీ, వీరు ఇద్దరూ అహమదాబాదుకు చెందిన పార్సీ స్త్రీలు. నేడే ఆశ్రమానికి వచ్చి, చీకటి పడ్డాక భగవాన్తో భాషించారు. "భగవాన్, మాకు చిన్ననాటినుండి ఆధ్యాత్మికాసక్తి. తత్త్వశాస్త్ర గ్రంథాలెన్నో చదివాము. మాకు వేదాంతము నచ్చింది. ఉపనిషత్తులూ, యోగవాసిష్టమూ భగవద్గీతాదులను మేము చదివాము. ధ్యానం ప్రయత్నం చేసాం గాని అవడం లేదు. ఆత్మానుభవమెట్లో మాకర్థం కావడం లేదు. ఆత్మజ్ఞానానికి మార్గం తెలియచేయండి.

మహర్షి: మీరు ధ్యానమెలా చేస్తున్నారు?

భక్తురాలు: 'నే నెవరు'తో మొదలు పెడతాను. 'నేను'గాని దేహాన్ని శ్వాసనూ మనస్సునూ నిరాకరిస్తాను. అంతే, ఆ పైన ముందుకి వెళ్ళడం లేదు.

మ: బుద్ధి పోగలిగిందంత దాకే, మీ ప్రయత్నం కేవలం బుద్ధితోనే చేస్తున్నారు. శ్రుతులన్నీ ఈ పద్ధతిని పేర్కొంటాయి. కాని అది సత్యాన్ని సూచించేదిగ మాత్రమే చెప్పినవి. సత్యాన్ని సాక్షాత్ చూపట మసాధ్యము. ఆ కారణంగా ఈ బుద్ధి

మార్గాన్ని చెప్పాయి. 'నేతి, నేతి' మార్గాన సాగే వారంతా 'నేను'ను తొలగించలేరు. 'నేనిది కాను', "నేనది'యనే వారికి "నేను" ఒకటే ఉంటుంది. ఈ 'నే'నన్న భావన అహంకారం లేదా"నేను" అనే ఆలోచన. మొట్టమొదట ఆలోచన "నేను". ఆ తర్వాతే మిగిలిన ఆలోచనలన్నీ వస్తాయి. అందుచే "నేను" మూల ఆలోచన. ఈ కూకటి వేరును పెల్లగించితే మిగిలినవన్నీ అవేపోతాయి. కాబట్టి ఆ 'కూకటి' - యోచనను కనిపెట్టు. 'నేనెవరు' అని నిన్ను ప్రశ్నించుకో, దాని మూలం కనుక్కో ఇతరములన్నీ అపుడంతర్ధానమై ఆత్మ యొక్కటే మిగులుతుంది.

భ: దాన్ని సాధించెదెలాగ?

మ: 'నేను' ఎప్పుడూ ఉన్నదే - నిద్రలో, కలలో, మెలకువలో గూడ. నిద్రలోని యతడే ఇపుడు మాట్లాడేవాడూను. "నేను" భావన సదా యున్నదే. నీ ఉనికి ననుమానించవు గదా? 'నేనున్నా'ననే అంటావు. ఆ ఉన్నదెవరో కనిపెట్టు. "నేను కానిదంతా"తొలగించే వాడు "నేను"ను తొలగించలేడు.

భ: అయినా ఇది నాకింకా అర్థం కాలేదు. ఇప్పటి "నేను" "మిథ్యా నేను" అని అంటున్నారు. ఈ కల్ల 'నేను' తొలగించే దెలాగ?

మ: ఏ కల్ల 'నేను'ను నీవు తొలగించ బనిలేదు. తాను, తనని ఎలా తొలగించుకొంటుంది? నీవు చేయగలిగింది ఇంత మాత్రమే; దాని పుట్టుపెక్కల్లో తెలిసికొని ఆ స్థానంలో నీ వుండు. నీ యత్నాలంతవరకే పోగలవు. ఆ తర్వాత, అచట ఉన్నదేదో, అదే అంతా చూచుకుంటుంది. అక్కడ నీ శక్తి పనిచేయదు. యే ప్రయత్నమూ అక్కడికి తీసుకొని పోలేదు.

భ: 'నే'నెప్పుడూ, యిప్పుడూ, ఇక్కడే వుంటే, నా కెందుకది తెలియడం లేదు. మ: అసలు విషయమే అది. తెలియడం లేదు అంటున్న దెవరు? సత్యమైన 'నేనా', మిథ్యయైన 'నేనా' పరీక్షించి చూడు. అది మిథ్యయైన 'నే'నని తెలుస్తుంది. ఆ మిథ్య 'నేను', పెద్ద అడ్డు. దాన్ని తొలగిస్తేనే నిజమైన 'నేను'ను కప్పిన తెర వీడిపోతుంది. 'నేను' ఆత్మజ్ఞుణ్ణి కాననే భావమే ఆత్మానుభవానికడ్డము. అసలు ఆత్మానుభవమయ్యేయుంది. అనుభవించవలసిందేదీ లేదు. అట్లేదైనా ఉంటే, అది క్రొత్త దవుతుంది. అంటే అది అంతకు పూర్వం లేదు, ఇక కావలసియుంది. పుట్టింది గిట్టక మానదు. ఆ అనుభూతి అనిత్యమైతే, దాన్ని కోరే పనేమి? కాబట్టి అది నిత్యమే; కాని ఆటంకాలవల్ల అది తెలియరావడం లేదు. మనకు కావలసిందది. ఆటంకాలను పోద్రోయటమే మనం చేయవలసింది. నిత్య వస్తువును మనం అజ్ఞానం వల్ల తెలియలేకున్నాము. అజ్ఞానమే ఆటంకము. దాన్ని తొలగించు, అంతా చక్కబడుతుంది.

అజ్ఞానానికి సమమైనదే అహంకారము. దాని మూలాన్ని చేరితే అది అదృశ్యమౌతుంది.

అహంకారం ఒక పిశాచం (spirit) లాంటిది. అది పట్టుకు చిక్కనిదైనా శరీరంతోనే పుట్టి, పెరిగి, లయించిపోతుంది. దేహభావనయే, మిథ్యయైన 'నేను'. దేహస్మృతి వదలుకో. అన్నిటికీ మూలమైన 'నేను'నన్వేషిస్తే, ఈ కల్ల 'నేను' వదలిపోవడం సాధ్యమవుతుంది. తానున్నాననదు దేహం. దేహాన్ని నే ననేది నీవు! ఈ 'నే'నేదో తెలుసుకో. దాని మొదలును అన్వేషిస్తే అది మాయమౌతుంది.

భ: అప్పుడక్కడ ఆనందముంటుందా?

మ: సత్తు చిత్తులతో కలిపే ఆనందము ఉంటుంది. ఆనంద నిలయుని సత్య నిత్యతల వాదాలన్నీ ఆనందమునకు చెందేవే. నీ స్వభావమే ఆనందము. దానికి ఇప్పుడు అజ్ఞానము కప్పియుంది. అజ్ఞానము తొలగించు. ఆనందము వ్యక్తమౌతుంది.

భ: జగత్ జీవేశ్వరుల పరమ సత్యాన్ని (ultimate reality) తత్త్వతః తెలుసుకోనక్కరలేదా?

మ: ఇవన్నీ "నేను" యొక్క పలు భావనలు మాత్రమే. నేనన్న తలపు రాగానే, ఇవన్నీ కనబడతాయి. నీ గాఢనిద్రలో వానిని గూర్చి యేమైన యోచించావా? అప్పుడు నీవున్నావు. ఆ నీవే యిప్పుడు మాట్లాడుతున్నావు. అవి యథార్థాలైతే నిద్రలో గూడ నుండ నక్కరలేదా? వాని కన్నింటికి "నేను" భావనే ఆధారం. ప్రపంచముగాని ఈ శరీరంగాని నీ వద్దకు వచ్చి తన్ను తెలుపుకుంటున్నాయా? నీవుగదా 'ఇది ప్రపంచము', 'నేను దేహాన్ని' అనడం. కాబట్టి అవన్నీ నీ నిశ్చయాలే. నీ పెవరవో తెలుసుకో. ఈ సందేహాలన్నీ నశిస్తాయి.

భ: ఆత్మజ్ఞానం తర్వాత శరీర మేమౌతుంది? అది ఉండునా, లేదా? అందరివలెనే ఆత్మజ్ఞులూ వర్తిస్తూ అగుపిస్తారే.

మ: ఆ ప్రశ్న ఇప్పుడు రావలసింది కాదు. ఆత్మజ్ఞానం కల్గేక ఆ ప్రశ్న అడగవచ్చు. అదీ అవసరమైతే. ఆత్మజ్ఞులా, వారి పని వారు చూసుకొంటారు. వారికై నీ కెందుకు చింత.

నిజానికి ఆత్మసిద్ధి తర్వాత దేహాదు లేవీ, ఆత్మకు భిన్నంగా కనిపించవు.

భ: అంతా సచ్చిదానందమే అయితే, దైవమెందుకని మాకిన్ని కష్టాలు కలిగించాడు? భగవంతుడు మనల్ని ఎందుకు సృష్టించాడు.

మ: మీకు కష్టాలు కల్గించానని దేముడు వచ్చి చెప్పాడా? ఆ మాట అనేది నీవు. అది గూడ ఈ "తప్పు నేను" చెప్తున్నదే. అది లేకుంటే, దైవమిది చేశాడు. అది చేశాడ'ని చెప్పేవాడే ఉండడు.

ఆ ఉన్న వస్తువు తానున్నాననిగూడ అనదు. "నేనులేను" అన్న సందేహం ఎప్పుడైనా వస్తుందా? తాను మనిషేనా, కాదా అన్న సందేహం కలిగినవాడు 'నేను మనిషి, నేను మనిషి'నని స్మరిస్తుండాలి. అట్లు చేసే వాడెవడూ ఉండడు. తాను ఆవనీ, గేదెయనీ అనుమానం వస్తే, తానవి కావనీ, మనిషే అని పదే పదే చెప్పు కోవాలి. అది ఎప్పుడూ జరగదు. ప్రతివాని ఉనికీ, ఆత్మానుభవ విషయాల్లోనూ అట్లే.

# భాషణములు 198

కొందరు స్త్రీలు: మరుజన్మలో మనిషి జంతువుగా కూడా పుట్టవచ్చా?

మ: సంభవమే. ఉదాహరణకు జడభరతుడు. యోగియైన ఆ రాజు తర్వాత జింకగా పుట్టాడని భాగవతంలో ఉంది.

భ: జంతు శరీరంలో కూడా ఆధ్యాత్మిక పురోగతి సాధ్యమా?

మ: అసాధ్యం కాదు గాని, చాలా అరుదు.

భ: గుర్వనుగ్రహమెట్టిది? అదెట్లు పని చేస్తుంది.

మ: గురువే ఆత్మ.

భ: ఆత్మసాక్షాత్కారానికి అది ఎట్లు దారి తీస్తుంది?

మ: 'ఈశ్వరోగురురాత్మేతి...' (ఈశ్వరుడే గురువు మరియు ఆత్మ) ప్రతి యొక్కడు ఏదో అసంతుష్టితోనే ఆరంభిస్తాడు. ఈ జగత్తులో తృప్తిపడక, తన వాంఛాపూర్తికై దైవాన్ని ప్రార్థిస్తాడు; వానికి మనస్సు శుద్ధమౌతుంది. అంత వానికి తన కోర్కెలు సఫలం కావడం కన్న ఈశ్వరాన్వేషణయందే ఆసక్తి హెచ్చుతుంది. దైవానుగ్రహం వ్యక్తమవడం మొదలౌతుంది. దైవం వానికి గురురూపంలో ప్రత్యక్షమౌతాడు; సత్యాన్ని బోధిస్తాడు. బోధతో, తన సంసర్గంతో వాని మనస్సును పవిత్రం చేస్తాడు. మనస్సు కపుడు శక్తి హెచ్చి, అంతర్ముఖం కాగలుగుతుంది. ధ్యానం దాన్ని మరింత పునీతం చేస్తుంది. చివరకది కొంచెమైనా కదలక సునిశ్చలంగా నిలుస్తుంది. ఆ నిశ్చలతే ఆత్మ. గురువు వెలుపలా లోపలా గూడ ఉన్నాడు. బయటినుంచి మనస్సు నతడు లోనికి త్రిప్పుతాడు. లోనుంచి దానిని ఆత్మాభిముఖంగా లాగి 'నిశ్చలం చేస్తాడు. అనుగ్రహమంటే అదే.

అంచేతే దైవానికీ, గురువుకూ ఆత్మకూ భేదమేమీ లేదు.

# భాషణములు 199

ఆ స్త్రీలు మహర్షి నెన్నెన్నో ప్రశ్నలడిగారు. సిద్ధమూ, నిత్యమూ అయిన ఆత్మను సాధింపలేక పోతున్నామని వాపోయారు. ఆత్మలక్షణం ఆనందము; అది వారికి కనిపించడం లేదన్నారు.

మహర్షి: చైతన్యం ఒకటే. కాని మనం దాన్ని దేహబుద్ధియనీ, ఆత్మబుద్ధియనీ పలువిధాల పేర్కొన్నాము. అవన్నీ ఏకమైన శుద్ధ చైతన్యంలోని తరతమ దశలే. చిత్ లేక కాలదేశాలు లేవు. అవి చేతస్సులోనే స్ఫురిస్తాయి. అవన్నీ సినీతెరపై కదలిపోయే చిత్రాలవంటివి. మన సహజస్వభావము శుద్ధచైతన్యమే.

భ: విషయములు ఎక్కడనుండి వస్తున్నాయి?

మ: నీ వెక్కడినుంచో అక్కడినుండే. ముందు కర్తను తెలుసుకో; విషయ ప్రస్తావన

ఆ తర్వాత.

భ: అది ప్రశ్న యొక్క ఒక అంశం మాత్రమే.

మ: కర్తలో విషయము ఇమిడి ఉంది. ఆ ఒక్క అంశం సకల విషయాలకు వర్తిస్తుంది. నిన్ను ముందు చూడు, తర్వాత విషయాలను చూడు. నీలో లేనిది వెలుపల కనిపించలేదు.

భ: నాకు తృప్తి కలుగలేదు.

మ: తృప్తి మూలాన్ని చేరిన తర్వాతనే. అంత దాకా అశాంతి తప్పదు.

భ: బ్రహ్మము సగుణమా, నిర్గుణమా?

మ: గుణములు నీకున్నవా, లేవా, ముందది తెలుసుకో.

భ: సమాధియంటే ఏమిటి?

మ: వ్యక్తియొక్క సహజ స్వభావము.

భ: మరి దానికై ప్రయత్నమెందుకు?

మ: ఎవరిదా యత్నం?

భ: నే నజ్ఞానినని మహర్షికి తెలుసే.

మ: నీవు అజ్ఞానివి అని నీకు తెలుసా? అజ్ఞానము యొక్క జ్ఞానం అంటే అది అజ్ఞానం కాదు.

చైతన్యము రెండు రకాలా? కనుగొనడమే శ్రుతుల ప్రయోజనము. అందరి యనుభవంలోనది ఒక చైతన్యమే. ఆ ఒకటే తన్ను రెండుగా విభజించుకోగలదా? ఆత్మలో అట్టి విభాగమున్నట్లు తోచునా? మేల్కొన్న వాడు, నిద్రలోనూ, మెలకువలోనూ ఉన్నది తానే యని గుర్తిస్తాడు. ఇది ప్రతివాని అనుభవమే. భేదము దృష్టిలో, అన్వేషణలో. చూస్తున్న నిన్ను "నా అనుభవానికి నేను భిన్నము" అని ఊహిస్తావు. అందువలన ఈ భేద బుద్ధి పుడుతుంది. అన్ని అవస్థల్లోనూ ఉన్నది నీవే యన్నది నీ యనుభవమే.

భః అజ్ఞానం ఎక్కడునుండి వస్తోంది?

మ: అజ్ఞానం అంటూ ఏమీలేదు. అది ఎప్పుడూ పుట్టడం లేదు. ప్రతివాడు కేవల జ్ఞానియే. జ్ఞానం సులభంగా ప్రకాశించదు. అజ్ఞానాన్ని ఆవల ద్రోయుటకే విజ్ఞానం, 'మెదలో నుంచుకొనే, పోయినదనుకొన్న ఆభరణం వంటి విజ్ఞానం. ఇతరులనందర్ని లెక్కించి తన్ను మాత్రం లెక్కించని పదుగురు మూర్ఖులలో ఒక్కని వంటిది. అది సతతమూ ఉన్నదే. ఎవరికి జ్ఞానం లేదా అజ్ఞానం?

భ: బయటనుండి లోనికి పోగూడదా?

మ: అలాంటి విభజన యేమన్నా ఉందా? బాహిరంతర భేదం నీకు నిద్రలో తెలుస్తున్నదా? ఈ భేదం కేవలం శరీరం వలన; శరీర బుద్ధి వల్ల జనించేడే అసలు జాగ్రదావస్థ యొక భ్రాంతి.

నీ దృష్టిని లోనికి మళ్ళించు. అప్పుడు విశ్వమంతా పరబ్రహ్మమయంగా ఉంటుంది. జగం మిథ్య యంటారు. ఆ మిథ్యయన్నదే అసలు సత్యం. భౌతిక శాస్త్రాలు గూడ, ఈ విశ్వమొక సూక్ష్మాతిసూక్ష్మమైన ఆధ్యపదార్ధము (primordial matter) నుండి పుట్టిందంటారు.

ప్రపంచం సత్యమనే వాళ్ళకూ, కాదనే వాళ్ళకు గూడ దైవము సమానమే. వారిలో దృష్టిభేదమున్నది. ఆ వాదాల్లో నీవు చిక్కుకోనక్కరలేదు. అందరికీ గమ్యమొకటే. దాన్ని పరికించు.

# భాషణములు 200

కోహెన్: 'గుప్తభారతాన్వేషణ' చివరి ప్రకరణంలో పాల్ బ్రంటన్ 'ఉజ్జ్వల తేజం' (బ్లేజింగ్ లైట్) అని ప్రయోగించాడు. అది యేమో వివరింపరా?

మ: అనుభవం మానసికం గనుక ఆరంభంలో అది ఉజ్జ్వలతేజంగా కనిపిస్తుంది. వాసన లింకనూ నష్టం కాలేదు కాని యీ అనుభవంలో మనస్సు అవధిలేక వర్తిల్లుతుంది.

నిర్వికల్ప సమాధిలో శుద్ధచైతన్యమున్నది. అది జ్ఞాన అజ్ఞానముల రెంటినీ దీపింప చేయగలదు. అది తమో ప్రకాశములు రెంటి కవ్వలిది. అది తమస్సుకాదన్నవరకూ నిజం; కాని అది ప్రకాశం కాదనుట కుదురుతుందా? కాంతి ఉంటేగదా విషయాలు కనబడుతున్నవి. ఆత్మసిద్ధికిగూడ ఒక దీప్తి ఆవశ్యకమంటే తప్పవుతుందా? ఇక్కడ దీప్తియంటే చైతన్యము. ఆత్మగా వెలుగొందేది ఆ చైతన్యమే.

యోగ మార్గాన ఆత్మసాక్షాత్కారానికి కొంచెం ముందుగా (నాందిగా) యోగులకు చిత్రవిచిత్ర వర్ణములు కనబడతాయి అంటారు.

పరమేశ్వర ప్రాప్తికై పార్వతీదేవి పూర్వం కఠోర నియమ నిష్ఠ లభ్యసించింది. ఆమెకు వివిధ దీప్తులు కనిపించాయి. ఆత్మ యథాపూర్వం ఉండగా, ఈ దీప్తులందుండి వెడలినవని వాని నామె లక్ష్యపెట్టలేదు. అవి పరమములు కావని ఆమె నిశ్చయము. నిష్ఠలింకా సాగింపగా ఆమెకేదో తేజం అనంతంగా గోచరించింది. కాని దానిని గూడ విషయమాత్రమే అని, బ్రహ్మము కాదని ఆమె త్రోసిపుచ్చింది. తన నిష్ఠ నామె కొనసాగించగా, పరమశాంతి ఆమెకు కల్గింది. అది బ్రహ్మమని అదే ఏకైక సత్యం ఆత్మయనీ ఆమె తెలుసుకున్నది.

తైత్తిరీయోపనిషత్తులో "తపమువలన బ్రహ్మమును తెలిసికో" "తపమే బ్రహ్మ"మని రెండు వాక్యాలున్నాయి. మరొక ఉపనిషత్తులో "ప్రజ్ఞానమయ తపస్సే బ్రహ్మము" "అచట రవి భాసింపడు; చంద్ర తారకలు, అగ్నియు భాసింపవు. ఇవన్నియూ దాని తేజస్సువల్లనే ప్రకాశమానాలు అవుతున్నాయి."